నన్ను దాచిపెట్టవె! రావా, తరిగొండెశురనై వేనూ
బూచికి నిండా వెరచేనూ, నను నీవు గావు దయతోనూ
నను నీవు గావు దయతోనూ 3

పేరూపెంపైనట్టి యీవూరూ, లోనుండె గొల్లావారూ
బూచిని దాచీనారూ, నిను బట్టిచ్చేమన్నారూ
నీకై పొంచుచున్నారూ, తరిగొండాధీశా! పోరా
బెట్టూకుంటె యెవ్వారూ, నిన్ను బట్టియ్యలేరూ
నిన్ను బట్టియ్యలేరూ 4

అమ్మా! బూ చెత్తా వుండూనమ్మా? ఆ[రి]ద చెప్పవమ్మా!
తెలిసితే మంచిదమ్మా! వాని రూ పెత్తిదమ్మా?
చేసినా మానిబమ్మా?[1] లేకా పెద్ద గంగమ్మా?
తరిగొండా హరితోరమ్మా! దాచకా చెప్పవమ్మా!
దాచకా చెప్పవమ్మా! 5

చూడు కృష్ణా! యూ బూచివాడూ, పండ్లికిలింపుచున్నాడూ
బలు బాకి నోటివాడూ, గోరులు బెంచినాడూ
మించినా గారడీడూ, తరిగొండాధీశా! వాడూ
నీ కొరకే పొంచినాడూ, నిను బట్టుకోకపోడూ
నిను బట్టుకోకపోడూ 6

యిత్తూ బూచివారంతా వత్తూమీరి యిందె వున్నత్తూ
చెప్పేవు, నన్ను గుత్తూగా నింతో దాచిపెత్తూ
తరిగొందాదిపు డేతత్తూ జనెనో తే రిందన్నత్తూ
వెదకింతో వాందా దిత్తూ[2], బూచీని వెళ్ళగొత్తూ
బూచీని వెళ్లగొత్తూ 7

---

1 'వేపవంటి పెద్ద మ్రానితో తయారు చేసిన బొమ్మయా?' అని యర్థము. తిరుపతి గంగజాతరలో వేపమ్రాని కాండముతో గంగమ్మ ఆకారమును గొప్పగా తీర్చుట ప్రసిద్ధము

2 'వెదకింట్లో వాండ్లు దిట్టూ' అనగా బూచికి పట్టియ్యదలచి వచ్చిన వారినిగాంచి, యశోద వారి యెదుట కృష్ణుని కొరకు ఇంట్లో వెదకినట్లు నటించి, యింట్లో లేడని చెప్పి, ఆ వచ్చిన వారిని తిట్టిపంపవలసినదని కృష్ణుని అభ్యర్థనము

నేనూ నీవెందు బోకుండ చేసినా చల్లని పాలా బోసేనూ
బంగరు వల్లె గట్టేనూ, సొమ్ములు శానా బెట్టేనూ
కొండెకు పువ్వులు జుట్టేనూ, తరిగొండాధిప ! నీవేనూ
నిండా గంధము బూసేనూ, నీకు పాల్ బువ్వ బెట్టేనూ 8

నేనూ యిక నెవ్వారింటికి బోనూ, బహుభీతి నొందుచున్నానూ
యింతోనే రామునితోనూ నెవ్వలు దాచె యింతోనూ
నేరాదిగి[1] దాగివుంటానూ, దాచిపెట్టికి వొచ్చితేనూ
తరిగొండగిరి డింతోనూ తే రావు బోపొమ్మానూ
తే రావల బోపొమ్మానూ 9

వూనూ ధైర్యము నా కొడుకా ! మేనూ వణకించె దింకా నూనూ
నె నిందె యుండగానూ భయమేమి రా యింటబ్లోనూ ?
తరిగొండాధీశా ! నేనూ బంగారు తొట్లాలోనూ
నిన్నుంచి ముద్దుగానూ జోలాపాటా బాడేనూ
జోలాపాటా బాడేనూ 10

† ఊరూ మనవూరి యూరావారూ, తేరకు నన్ను
వారుధంతా నిందించినారూ

నే నింతో వుంతె పోరుబెత్తేట్ల గిచ్చినారూ[2]
నిను గానకుండా వారూ, నన్నెత్తుక పోయినారూ
పాలూ[3] దెచ్చినారూ, రామరసమూ[4] చేసినారూ

---

1 'నేదాదిగి' (వేదు + ఒదిగి) అని గ్రాహ్యము

† ఈ గుర్తుగల చరణములలో నాలుగుకన్న ఎక్కువగా పాదము లుండుట గమనింపదగినది

2. 'పోరుబెట్టేట్ల గిచ్చినారు' అనగా పోరు బెట్టునట్లుల గిచ్చినారని భావము

3 'పాలు' అనుటకు బాలభాష

4 ఇది యొక రకమగు పానీయము బాదాము పప్పు, సారెపప్పు, గసగసాలు, గులాబిపూలు, ఎండు ద్రాక్ష, ఏలకులు, లవంగములు, చక్కెర, గంజాయి పూలు మొదలగు దినుసులను పన్నీరంటిపై నూరి ఆవుపాలలో కలిపి, అందుండి సారమును వడియగట్టుదురు ఆ సారమునకు 'రామ రస'మని పేరు రమింప జేయునది — అనగా, పరవశింపజేయునది — అను అర్థమున ఈ పేరు దీనికి సార్థకము Contd

నాకూ దాగించినారూ తానదే తాగినారూ
చాలా మత్తిల్లినారూ, 'తరిగొండాధీశా ! మూరూ
కే సల్పుమన్నారూ, తానేమొ జేచినారూ
తా మేమొ జేచినారూ 11

వోరి నురుదు కృష్ణా ! యూవూరి గరితాలు నిన్ను దూరీ
ఎఱ్ఱుచు బల్ వెసారీ నిందించి రింకా వారీ
పడుచూ లుంగ నా దారీ పోఐదు వెన్నా గోరీ
పోతె కొట్లే నీసారీ తరిగొండా నరహారీ !
తరిగొండా నరహారీ ! 12

† నత్తూ బుత్తించి నన్ను బత్తూకోసి తాను నాచుత్తూ
సిర్పి గందాము బూత్తూ, మెల్కొ పూసరులు వేత్తూ
నెత్తినా పూలు బోత్తూ, వెన్నా నోతి కందిత్తూ
వేరిపాలు దాగిత్తూ, నాకు వక్కాకు తిత్తూ
నా చెక్కిళ్ళు గరుత్తూ, నాగుత్తు బట్టి చూత్తూ
సన్న్యాసరకె నవ్వుత్తూ, తరిగొందాహరి నూ పొత్తూ
కురాని[1] నన్నూ పత్తూకోవొత్తే నే వెరుత్తూ
కూగూతాలు నే గూత్తూ, లేచి నే పరిగెత్తూ
కో రాబోతే నాజాత్తూ, బత్తిర్ప్మేమో తేత్తూ

వుంతె నే నురికెత్తుకుంతా యింతికీ వొత్తూ
నావెంబరీ నరుత్తూవ చ్చిందు నన్ను రత్తూ
చేచినా సతుల బత్తూ, చెంపా లదరగొత్తూ
చెంపా లదరగొత్తూ 13

---

సాధువులు, సన్న్యాసులు, బైరాగులు, మహంతులు, యోగులు మున్నగువారు తాత్కాలికము గా ప్రాపంచిక విషయముల కతీతులై తన్మయీ భావముతో నుండు నిష్ఠితము రామ రసమును సేవించెడివారు

1 'నూపొత్తుకురా + అని' అని విభజనము

ఓరా ! నాముద్దుతండ్రీ ! చేరా[1] యిట్లా మాట్లాడకూరా !
ని న్నుప్పతించేరూరా ! పోకళ్ళ నేర్వకూరా !
నీకు దృష్టి తాకిరా ! నేనేమి సేయుదురా ?
తలగొండాఓశా రారా ! మంగళారతిచ్చేరా !
మంగళారతిచ్చేరా ! 14

ఆ వె అని యశోద మంగళార తిచ్చిన, కృష్ణు
డనియె నిట్లు గొల్లవనితలెల్ల
నన్ను నుప్పతించినారు గావున పత్తి
కొత్త కొత్త కొత్త గోపిదేవి !

క అని గోపాలుడు తల్లికి
వినిపింపగ, గోపసతులు వెరగందుచు ని
తనయుని మాటల కిప్పుడు
కొనమొద లేదమ్మ[2] నందగోపాలసతీ ?

(వ అనిన విని యశోద వారి కిట్లనుచున్నది )

క నా కొడు కుండిన చోటను
నీ కూతుల జేరనిక మెలుపుగ మీ మీ
వాకిండ్లందును (భద్రము)
గా కావలిబెట్టు, డేల కలహించెదరే ?

వ అని పలికి యశోద గోపసతుల సముదాయించి పంపించె, నంత మరునాడు గోపసతులు గుమిగూడి పెరుగు చిలుకుచు తమలో దా మిట్లనుచున్నారు

## దరువు (జావిడి)

చిలుకరమ్మా ! చిరచిర పెరుగా చిలుకరమ్మా ! ॥పల్లవి॥
చిలుకరమ్మా ! ము — ద్దుల గోపాలుడు

---

1 'చేరా' అనగా 'చేరకు' (ఊరక) అని యర్థము

2 'కొన మొదలు+ఏదమ్మ' అని విభజనము అనగా 'చివరలేదు; మొదలు లేదు' అని భావము

తులువై కుండలు — ద్రోయక మునుపే ॥చిలుకరమ్మా ॥ఉ ప ॥
సందుల గొందుల — యందుచు పొంచుచు
ముందర కృష్ణుడు — మొనయక మునుపే ॥చిలుకరమ్మా ॥ 1
దాగుచు మూగుచు — నాగడపరుచుచు
మీగడ గొని వాడు — మెక్కక మునుపే ॥చిలుకరమ్మా ॥ 2
కిలకిల నవ్వుచు — ఖేలను జూపుచు
బలు కష్టంబులు — బట్టక మునుపే ॥చిలుకరమ్మా ॥ 3
గిరగిర కవ్వము — లరిముది దిరుగగ
నొరసిన మెరుగుల — నురుగులు గరగా ॥చిలుకరమ్మా ॥ 4
తరిగొండాధీ — శ్వరుడగు వేంకట
గిరి నిలయుండగు — కృష్ణుడు వచ్చీ[1] ॥చిలుకరమ్మా ॥ 5

వ అని యిట్లు పెరుగు జిలుకుచున్న సమయంబున కృష్ణుండు క్రమ్మర గోపసతులమీద దాడివెడలి, యాడుచు పాడుచు, చల్ల చిల్లాడ నుల్లాసంబున కొల్లకాడై రాగా, నల్లనయ్యను జూచి వల్లవపల్లవాధరలు చెల్లరే! యని తమలో దా మిట్లనుచున్నారు

## దర్వు, ఆదితాళం

తిరుగా వచ్చెనే! కృష్ణుడు — తెరవలారా! వాకిండ్లకు
కరుకు[2] బిగములు వేసి — కావిళ్ళుం[3]దామే! 1
నుట్టుపట్ల పొంచి విని — పట్టి కట్టివేసి, పూని
గుట్టుగా యశోదకడకు — గొంచుపోదామే! 2
తన వెంటా శ్రీతరిగొండా — ధాము డున్నాడను గోపెమ్మా
కనువందాగా వీని మాయ — లపుడూ దెలుసూనే! 3

1 'వచ్చిని' అనగా 'రాగలడు' అని యర్థము
2 'కరకు' యొక్క వ్యావహారిక రూపము 'కఠినమైన, గట్టి' అని యర్థములు (చూ శర పుట 166)
3 'కావడి'కి వ్యావహారిక రూపము 'కావిడి' దానికి బహువచనము 'కావిళ్ళు'.

వ అని పలికి, వాకిండ్లు వేసి కృష్ణునిచుట్టు పరివేష్టించిన గోపికలతో కృష్ణుం డిట్లనుచున్నాడు

## దర్వు (ధ్రువం)*

పత్తుతారా? (మీరు) నన్ను పత్తుతారా? ॥పల్లవి॥
గుత్తు గుత్తుగా వూత్తారు — కుంతా వున్నారీర మీరు॥పత్తుతారా?॥ఉ ప॥
మీ కందలికిని నేను — మిందగారనై వొత్తినీ
నాకు[1] వేలుపిక లేదు — నంగనాచి తొత్తులాల। ॥పత్తుతారా?॥ 1
పెద్ద పెద్ద వాకిందాకు — బీగమూలు బాగా వైచి
పద్దుపత్తి మీలు నన్ను — పత్తుతామంతీ రత్తైతె ॥పత్తుతారా?॥ 2
తరిగొందా నారాచిమ్ముని — దాచ్చిన్యాము మీకు లేక
పరగా మాయమ్మ చెంతాకు — పత్తూకొపోతామంతారు ॥పత్తుతారా?॥ 3

వ అని కలహించినట్టుండి అంతరిక్ష మార్గంబున వారిండ్లలో జొరబడి దధిక్షీర నవనీతంబులు మెక్కి, కొల్లబెట్టి, నానా విచిత్రంబులైన దుడుకులు జేసి, యొక్క ముద్దుపాపని పొట్టనిండ వెన్నగూరి, వాడు గ్రుడ్లు వెలి కురికి యూపిరి ద్రిప్పలేకున్న సమయంబున కృష్ణుండు అంతర్ధానంబున వచ్చి యశోదచెంత నుండె, నంత గోపసతులు కృష్ణుని గానక, పోయెనని[2] బీగంబులు దీసిపోయి, తమ యిండ్లలో నడిచిన విచిత్రంబులకు వెరగుపడి, యూపిరి ద్రిప్పలేకున్న బిడ్డను గొనివచ్చి యశోద ముందర బెట్టి యిట్లను చున్నారు

---

* ఈ 'ధ్రువ' మనునది 'జావిడి'వలె దరువులలో నొకరకమని తెలియదగును 'ధ్రువపద' మని దీని నామాంతరము

చూ 1) నృత్తరత్నావళి 7వ అధ్యా, 65 శ్లో
11) భరత కోశః, పుట 299

1 'నాకంటె' అని యర్థము

2 'ఆచటినుండి వెళ్లిపోయెనని' అని యర్థము.

## గోపికల ఫిర్యాదు

ద్విపద. ఈ పాప మేమమ్మ — యింతి గోపెమ్మ ?
నీ పాప డిప్పుడు — నీ చెంత నిలిచి
యున్నాడనుచు జెప్ప — చున్నావు నీవు
వెన్న డిప్పుడు నిన్న — విడిచిరా జూచి
వెరచి నాకిండ్లకు — వేవేగ మేము
కరుకు బీగంబులు — గదియింప, జూచి
మాతోను కలహించి — మమ్ము బొంకించి
యే తీరుగానొ తా — నిండ్లలో జొచ్చి
పాలు ద్రావియు చట్లు — పగుల నడంచి
బాలామణుల గూడి — బాలుని సొట్ట
విరియ కుత్తుకబంటి — వెన్న దా గూరె
నరయగా నాబాలు — డప్పుడు గుడ్లు
చాల వెల్కురుకగా[1] — సంకటపడుచు
లీల నూపిరి ద్రిప్ప — లేకయున్నాడు
ఈపాప డేమైన — నిది నీకె సెలవు ![2]
నీ పట్టిచేతను — నేడు మా పట్టి
యీ తెరునాయె — నింకేమనవచ్చు ?
శ్రీ తరిగొండ నృ — సింహుని తోడె !
కాపురములు జేయ — గాజాల మిచట
మీ పల్లె జాలించి — మేము బోవలసె

(వ అనిన విని యశోద గోపసతులతో నిట్లు పల్కుచున్నది )

క నాపాపడు నా చెంగట
నీ పగిదిని బలునితోడ నిందాట్లాడున్
మా పిన్నవాని కొరకై
యీ పల్లెను మీరు విడువనెందుకు ? బోరే !

---

1 'వెల్కి (వెలికి) + ఉరుకగా' అని విభజనము.

2. అనగా 'ఆ పాపపుణ్యములు మీవే సుమా !' యని భావము.

[వ అనిన విని గోపికలు యశోదతో నిట్లనుచున్నారు ]

## ద్వరు, ఆటతాళం

గోపెమ్మా! యేమె గోపెమ్మా! ॥పల్లవి॥

గోపెమ్మా! మావల్ల — పాపములేదు నీ
వీ వట్ల మామీద — కోపము జేయకు ॥గోపెమ్మా॥ఉ ప॥

యిట్టి లోకాతీతు — డీవ్వాదిలో బుట్ట
బట్టి మా బ్రతుకూలు — బంగారమై పోయనే! ॥గోపెమ్మా॥ 1

బాలకుడని నీవు — భావింపుచున్నావు
బాలుడు గాడు నీ — పాదములాన వో ॥గోపెమ్మా॥ 2

చిన్నికుర్రలను — జూచితిమమ్మ! భూమిలో
నిన్ని నేర్చిన కుర్ర — నెరుగ మెన్నోటను ॥గోపెమ్మా॥ 3

రమణిరో! యివి మత్స — రంపు మాటలుగావు
క్రమముగా నడుగు మి — క్కడివారి నెల్లను ॥గోపెమ్మా॥ 4

పాదైనా[1] తరిగొండ — పతితోడె! నీ బిడ్డ
మీాద దబ్బరచాడి — మేము జెప్పలేదే! ॥గోపెమ్మా॥ 5

ద్విపద వెలది! నీ కడుపులో — వేలెడు బిడ్డ
కలుగునా? యని మేము — కన్నదేవళ్ళ
నురుభక్తితో వేడు — చుంటి మీావరకు
తరిగొండహరి మీాకు — తనయు నిచ్చుటకు
ముదమందుచుండగా — మొనసి నీ కొడుకు
విదితంబుగా జూడ — విపరీతుడయ్యె
వీడు జేసిన పనుల్ — వివరంబుగాను
చేడె! నీతో మేము — చెప్పనేలేదు

---

1. 'నిలుకడయైన' అనగా 'శాశ్వతుడైన' యని భావము.

కొడికొడిగా నిందు — కొన్ని జెప్పితిమి
కడముట్ట నీతని — కార్యంబులన్ని
జెప్పితిమైన[1] బర్ — సిగ్గులచేటు
జెప్పనేటికి ? మాకు — సెలవియ్యవమ్మ ।

(వ. అనిన విని నందసతి వారితో నిట్లనుచున్నది )

క ఇక్కడ నుండెను బాలకు.
డెక్కడి కెవ్వాడు వచ్చె ? నా పనువెల్లన్
తక్కక నెవ్వడు జేసెను ?
దిక్కే దీమాయ మాకు తెలియదుగదరె ।

(వ. అనిన విని యాగోపిక లిట్లనుచున్నారు )

## దరువు

ఇక్కడా వీడుండె నంటివమ్మా ।
మా యిండ్లాకు వే, రొక్కా డేరనుండి వచ్చెనమ్మా ? 1
సత్యాముగా నీడె వచ్చెనమ్మా ।
వగలెన్నో జేసి, సతుల కుచములా ప్రచ్చెనమ్మా । 2
అందారిండ్లపాలు ద్రావెనమ్మా ।
యింటింటి కుండ, లడచియడచి పారవైచెనమ్మా । 3
బాలామణులాను బట్టెనమ్మా ।
పసిబిడ్డలాకు, భావజునికేళి నేర్పెనమ్మా । 4
వీ డెక్కాడి చిన్నవాడోయమ్మా ?
తరిగొండహరికి నీని, వింతాలన్ని దెలుసునమ్మా । 5

క తక్కక కృష్ణునిదుడుకులు
వెక్కసమై తోచె గనుక, వీనివలన మే
మెక్కడనైనను బోయెద
మిక్కడ నిక నుండవెరతు మిదె సెలవు సఖీ ।

1 'చెప్పినమైన' అని యర్థము

ంద అని వారు బల్కగా — నపుడా యశోద
విని యిట్లనియె నో — విరిబోణులార!
హెక్కసుచే[1] మాట — లని యూరు విడిచి
యెక్కడ బోను మీ — కేల? నాసుతుని
ఏయెడనైన నే — నేమరకుందు
మీయిండ్ల కెటు నన్ను — మించి రానచ్చు?
వచ్చెబో సతుల నె — వ్వరి నేల వచ్చు?
వచ్చెబో మీ పాలు — వాడెన్ని ద్రాగు?
త్రాగెబో కుండ లెం — దరివని నీగు?[2]
నీగెబో మీరన్న — నేర్పు లే మెరుగు?
ఎరిగెబో స్మరకేళి — నేరీతి మరుగు?
మరిగెబో సతుల నె — మ్మొడ్కని బట్టు?
బట్టెబో రతి యెల్ల — బంమెట్టు బుట్టు?
పుట్టెబో యిట్టి య — ద్భుతము లిక్కడను
గలువెళ్లి నా కొడు — కెందు రాలేదు
తెలియక మీ రుప్పు — తించకురమ్మ!
పుట్టి పుట్టక మున్నె — బుడుతని రచ్చ
బెట్టిన ఫలమేమి — ప్రియమెుల్ల మాని?
తప్పు గల్గిన నేనె — దండింతు సుతుని
నెప్పు డెక్కడ బోకు — డిండ్లకు జనుడి!
హరిగొండహరితోడె! — దాక్షిణ్య ముంచి
పొరుగువాళ్లకును మీరు — పోకుండరమ్మ![3]

అనిన విని గోపిక లిట్లనుచున్నారు )

మెలత యశోద! నీ కొడుకుమీదను సారెకు నిందమాటలన్
వలనుగ జెప్ప నిందు పగవారముగాము, నిజంబు జూచితే

---

'అక్కసు'కు పూర్వరూపము 'ఆగ్రహము, కోపము' — అని యర్థములు
నీగు = నివర్తించు (తొలగించు) — అని యర్థము (చూ శ.ర, పుట 438)
'పోక + ఉండరమ్మ!' అని విభజనము.

నలరగ సీరు మాదొరలు, నాళ్ళులు గావున మామనంబులన్
కలుగునె యెంతకైన పగ కంఠదళాక్షునివీాద భామినీ ?

[వ అనిన విని యశోద యిట్లు పల్కుచున్నది ]

సీ. పీ చిన్నవానికి మా చిన్నిపాపడు
వెన్నగూరెనటంచు వెక్కసముగ
పలికితి రా మాట పాటింప దబ్బర
మరి యిది యక్షిణి మాయగాను
తోచుచున్నది. మంచి నీచిన్ని పాపని
కడుపెల్ల నివురుచు నుడుకునీళు
బోయుము. కరిగి తెప్పున వెన్న డిగిపోవు
పాపని కట ప్రాణభయములేదు

గీ. వసుధ యక్షిణి యనెడు దేవతకు సిరు
శాంతిగా జాతరలు జేయు డంత నిచట
పుచ్చి విట్టి విచిత్రముల్ పొలతులార!
వెగ బోరమ్మ! యిండ్లకు వెలదులార!

ఆ వె అని యశోద ఋక్కు నాకొమ్మ లిట్లని
రమ్మ! కృష్ణు డిచట నెమ్మదిగను
మమ్ము నెల్పెడు. మా కింక సెలవియ్యు
డనుచు నడుగుచుండి రబ్జముఖులు

## గొల్ల గౌడు

ద్విపద ఆ లోన ముసలివా – డగు గొల్లగౌడు[1]
పాల కావడి మూపు – పైన నుంచికొని
గొంగడి ముసుగుతో – గూను వంచికొని
యుంగరముం కట్టె – యూతజేసికొని

1 'గౌడు' అనునది ఒక పట్టపుపేరు కొంత స్థితిమంతులైన గొల్లవారిపేళ్ల చివర 'గౌడు' పదమును చేర్చుట నేటికిని రాయలసీమ ప్రాంతమున వ్యవహారమందు నున్నది అట్లె 'గౌడు'లు గొల్లవారిలో కులపెద్దలుగా వ్యవహరించుటయు గలదు

కసరుచు రెండు కు — క్కలు వెంట రాగ -
మసలిది యున్నట్టి — ముంగిటి కవుడు
పోయి, తా దాన న — వ్వడు గాన కలిగి
యూయెడ తరిగొంగ — వారి సేయు పనుల
కొరకు గొపెమ్మతో — కొట్లాడుచోటి
కరిగి యుట్లనియె కో — పావేశమునను

## దర్వు, ఆటతాళం

వోశోశి ముసిలాపె! — వోశోశి ముసిలాపె!
వోశోశి ముసిలాపె! — వో ముసిలాపె! ॥పల్లవి॥

కూశికూశి మన — గోపెమ్మతోడ నా
క్రోశముతో నీవు — కొట్లాడేదెమే? ॥వోశోశి॥ 1

కమ్మగా నంబిలి[1] — గాశే కోడండ్లాతో
నెమ్మెలు శేసూత — నిందుండావేమే? ॥వోశోశి॥ 2

నాకు కడుపులోన — నాకిలా[2]తుండాది
నీకు భయము లేక — నే యుండావేమే? ॥వోశోశి॥ 3

సక్కగ తరిగొండ — సామిపూజ శెయ్య
కిక్కడనే వుండా — లీ పాపమేమె? ॥వోశోశి॥ 4

గీ. అనిన విని గొడసాని యిట్లనియె ముసలి
వాడ! కృష్ణుడు రేపల్లె వాడలోన
పుట్టినప్పుడె కాపురంబులు మునింగె
నావిధం బెట్టు లన్నను నీవు వినుము

## దర్వు, ఆటతాళం

ఇంకేటి కాపురమురా? వో ముసిలోడ!
యింకేటి కాపురమురా? ॥పల్లవి॥

---

1 'అంబిలి' ఇది 'అంబలి'కి వ్యావహారిక రూపము

2 'ఆకిలి' ఇది 'ఆకలి'కి వ్యావహారిక రూపము.

యింకేటి కాపుర ? — మీవూళ్లో క్రిష్టుడు
మంకువాడై నాతో — మల్లాడవచ్చినా
॥ డింకేటి కాపురమురా ? ॥ ॥ఉ ప ॥

పాలాకుండలు గొట్టి — బాలామణుల బట్టి
ఛీలల్ల ! శిగ్గూలు — జెరచి గాబరజేశె ॥నింకేటి॥ 1

యెరనాగి న్నలనాగి[1] — న్నిరుకువూనికాడ
కరిచి బరికి ఆట్ల — గా[2] జేశినాడంట ॥యింకేటి॥ 2

తరిగొండ నరహరి — దాడి మెండైనాది
సారుగూళ్ల కైనాను — పోదాము వలసగా ॥నింకేటి॥ 3

వ అనిన విని ముసలివాడు గోపిదేవితో నిట్లనుచున్నాడు

గీ అమ్మ ! గోపెమ్మ ! మీాకు నే(ం) మన్నుపన్ను[3]
నిచ్చి కాపుర మిందుంటి, మింక నుండ
వెరతు, మాపులతోడ వేవేగ కృష్ణ
వంప బోయెదమమ్మ ! యీా వాదులేల ?

వ అనిన విని యశోద యిట్లనుచున్నది

ఆ వె గౌడ ! నీకు ఇంత కోపమేటికి ? (మీారు)
వలస బోవనేల ? వలదు నిలువు.
డర్భకుండు మీా గృహంబుల కిక రాడు
పొందు ! వీనివలన బోవనేల ?

వ అని పలికి, గౌనితోడ నందరికి వీడెంబు లిప్పించి యాదరించి గోపకాంతల నిండ్లకు పంపించి, తదనంతరంబున

---

1 'ఎఱ్రనాగి, నల్లనాగి — అను పేళ్లుగల గోపికలను' అని భావము

2 'ఆటలుగా' అని యర్థము

3 'నేలపన్ను (నివాస శుల్కము)' అనగా ఒకరి స్థలమున వసించుచున్నందులకుగాను ఆ స్థలము స్వంతదారునకు చెల్లించెడి పన్ను నందగోపుడు వ్రేపల్లె కధిపతి గనుక అందు నివసించు గొల్ల లెల్లరు యథోచితముగా ఆతనికి మన్నుపన్ను చెల్లించుచుండిరి,

## నందసతి సందియము

ద్విపద అనుమానమున బొంది — యపుడా యశోద
తనయుని తొడమీద — తగ నుంచి, చుంచు
చేతుల దువ్వుచు — చెక్కిళ్ళు నిమిరి
'నాతండ్రి! యీ చిన్న — నాడు నీకింత
యారడి వచ్చె, నే — మందు నావిధిని?
యూరివారెల్ల ని — న్నుప్పతించినను
నే వినవలసె, నీ — నెత్తిన బ్రహ్మ
దేవు డీరీతి మో — దింపుచు[1] వ్రాసె'
నని యిట్లు తరిగొండ — హరి నాదరించి
చనుబాలు ద్రావించి — జాలితో ననియె

### దర్వు, నీలాంబరిరాగం, ఆదితాళం

నాతండ్రి! యిందరికి వెరచి, భూ — తాళిత! నే నిన్నెందు దాతురా?
॥హా॥ యేమిసేతురా? 1

మెచ్చుతున్న సతులాకు ని — మీద నింత మాత్సర్యము హెచ్చెరా!
॥హా॥ యింత వచ్చెరా! 2

శ్రీకర తరిగొండ నార — సింహుతోడే నీ వింకెందు బోకరా!
॥హా॥ దూరు దేకరా! 3

గీ. అనుచు కృష్ణుని నీరీతి నాదరించి
కన్నులను నీరు నించ, ముఖంబు నిమిరి
యేమి దోచక రోహిణిన్ బిలిచి (మిగుల)
జాలితో నిటుబల్కె నాశ్చర్యముగను

సీ. ఓ రోహిణిదేవి! యొకమారుగాకుండ
పలుమారు నా గొల్లభామలెల్ల

---

1. 'మోదుచు (కొట్టుచు)' అని యర్థము

పలికిన పల్కు లేర్పడ దబ్బరనరాదు
బుడుత డాయిండ్లకు బోనులేదు
కావున నిజమేది ? కల్లయే ? దీమాయ
తెలియ దెవ్వారికి, దేవు డెరుగు
ఎన్నాళ్లకో నేను కన్న బిడ్డకు లేని
నింద వచ్చుటకు నా డెందమెల్ల

గీ వెన్నకై వడి గరగుచు నున్నదిపుడు
గోపికల నేరమందునా ? కొడుకు నేర
మందునా ? రెండు దెలియులేదమ్మ ! నాకు
తెలుపు నీవైన నొకమాట తేటగాను

(వ అనిన విని రోహిణీదేవి యశోదతో నిట్లనుచున్నది )

### ఏలలు*

దబ్బారా లాడారు గోప — తరుణాలూ, పీ డెందుబోలే
దబ్బబ్బా ! యిదేమో తెలి — యావే వోహో యశోదా !
యద్భుతమై తోచుచున్నాదే ! 1

యీముద్దు కృష్ణునివలెనే — యేభూతామో యీపూరిలో
తా మహిమా జూపుచు — న్నారే వోహో రోహిణీ !
తథ్యామిది దబ్బారా గాదే ! 2

ఆ మాయా నివారాణా మిం — దయ్యేటందూ కందారాము
గ్రామాజాతర జేయిం — తామే వోహో యశోదా !
గంగాకు బోనాము లిత్తామే ! 3

ఉరగాశైలాధీశుడైనా — తరిగొండా హరికీ మ్రొక్కి
త్వరగా నట్లానే జేయిం — తామే వోహో రోహిణీ !
తనయునీ నిందా దప్పింతామే ! 4

* ఇందు రోహిణీయశోదల సంభాషణ కలదు

వ అని నిశ్చయించి యా యశోద కృష్ణుని యెమరక నాదరింపుచుండగా, అందొక్కనాడు కృష్ణుడు వ్రేపల్లెలోకి దాడివెడలి పోవుచున్న జూచి యశోద యిట్లనుచున్నది

## దరువు

ముద్దుకృష్ణా రారా ! వెన్న — ముద్ద లిచ్చే కోరా ! ॥పల్లవి॥
హద్దు విడిచి నీవెందు బో — వద్దు వద్దు రారా ! ॥అ.ప.॥
పొరుగిండ్లకు బోయి లేని — పోరు దేక రారా !
యిప్ప, డరసి యింట్లో రామునితో — నాట్లాడుదు రారా !
॥ముద్దుకృష్ణా !॥ 1

పొరుగిండ్లలో పొంచి పెద్ద — బూచి వుంది రారా !
గొల్ల, బరికీ బరికీని బొజ్జంతా — కరిచిపొయ్యా[1] రారా !
॥ముద్దుకృష్ణా !॥ 2

బొజ్జా వాడను, పచాలు — బువ్వా బెట్టే రారా !
ఘుల, గజ్జాలు వదలీనావి — గట్టిగ గట్టే రారా !
॥ముద్దు కృష్ణా !॥ 3

పరువు లెత్తితేను నిన్ను — పట్టలేను రారా !
గొల్ల, గరితాలు గొట్టేరు, బొజ్జ — కందవాడా రారా !
॥ముద్దుకృష్ణా !॥ 4

తరిగొండహరితోడే కడప — దాటిపోక రారా !
వోరి, దురుసూగా పరువులెత్తక — తులువాబిడ్డా రారా !
॥ముద్దుకృష్ణా !॥ 5

వ అని పలికి కొడుకు నొడిసి పట్టికొని, బలభద్రునితో నాట్లాడుమని నియమించిన, రాముణ్ని జూచి కృష్ణుం డిట్లనుచున్నాడు



---

1 'కరిచిపోవును సుమా !' అని బెదరింపుతో కూడిన హెచ్చరిక

## దర్వు*

అన్నా! యింతో కన్నాముచ్చి — లాలుదాము లాలా! ॥పల్లవి॥
వొరీ, చిన్ని తమ్మురా! — కండ్లూమూశే నిందు లాలా!
॥అన్నా! యింతో॥ఉ వ.॥

ఆడరగా నిచ్చోట చిడుగూ — డోరుకుందాము రారా!
గుడుగుడుగుంతా మూరుకుంలా — కూచుందాము రారా! ॥అన్నా!॥ 1

చిట్లబట్లా కాయాడాను[1] — చేతులు జాచీ రారా!
గిరి, గిట్లాడుద మిందూ — గిరగిర దిరుగా రారా! ॥అన్నా!॥ 2

కుందికుంది యాట లాడు — కుందా మిందు రారా!
మన, మందమైన గచ్చకాయు — లాడుదాము రారా! ॥అన్నా!॥ 3

పరువూ లెత్తి వొకరీ వొకరు[2] — పత్తుదాము రారా!
ఏన, తరిగొండా నారదిమ్మని — తాకుదాము రారా! ॥అన్నా!॥ 4

## మృద్భక్షణము

వ. అని యివ్విధంబున రామకృష్ణు లాట్లాడుచు ముద్దులు జూపుచుండి రంత నొక్కనాడు కృష్ణుండు మృద్భక్షణంబు జేయుచున్నం జూచి, రాముడు యశోదతో నిట్లనుచున్నాడు

ఉ తల్లి యశోద! కృష్ణు డల తావుల తావున జేరి ముదంబుమీరగా
నల్లని మంటిపెళ్లలను నవ్వుచు మెక్కుచునుండె నిప్పడే
కల్లని నన్ను దిట్టకుము, కంజదళాక్షుడు వెన్నదిన్న నో
రెల్లను మన్ను మెత్తికొనె, నీడకు బిల్వవె! నీవు జూడవే!

వ అనిన విని యశోద కృష్ణుని చేరబిల్చి యిట్లనుచున్నది

---

* ఇందు శ్రీకృష్ణబలరాముల ముచ్చట (సల్లాపము) కలదు

1 'చిట్లబట్లాకాయాడాను' — అనగా 'చిట్లబట్లకాయ' అను ఆట ఆడుటకు,

2 'ఒకరి నొకరు' అని యర్థము

## ఏలలు*

మన్నా నీవూ దిన్నావని — మన రామూడూ జెప్పినాడూ
మన్నాగా నిక్కామేనేమిరా ? వో ముద్దూకృష్ణా !
— భయపడాకా నాతో జెప్పరా ! 1

జున్నూ పాలూ నెయ్యి వెన్నా — తిన్నా నోతా చీ ! పీరా[1] నే
మన్నూ కోరి తిందూనంటావే ? వో యచోదమ్మా !
— అన్నా వూరి కన్నాలు పోవే ! 2

నోరీ ! రామూడన్నామాట — వుత్తామాటంటి వల్లైతే
భోరూనా నీ నోరు దెరువారా ! వోముద్దూకృష్ణా !
— పాలువూమీరా నేనే చూచేరా ! 3

శ్రీ తరిగొందా వరానారా — చిమ్మచ్చామీతోడే ! మన్నూ
నే తినాలేదూ, తిత్తూనావే ?[2] వో యచోదమ్మా !
— నీవూ నానోరంతా చూరావే ! 4

వ. అని కృష్ణుండు నోరు దెరచి అనేక కోటి బ్రహ్మాండంబులు తన నోట జూపిన, యశోద భయభ్రాంతయై రోహిణితో నిట్లనుచున్నది

ద్విపద ఇది యేమొ రోహిణి ! — యీ చిన్ని శిశువు
వదనంబులో ధర — వన వహ్ని పవను
లాకసంబును, మహ — త్త్వాహంకృతులును
లోకపాలకులును — లోకముల్, నదులు
వనధులు, దీవులు — నన పర్వతములు
ఘన సూర్య సోమ న — క్షత్ర పంక్తులును
పొసగి చరాచర — భూత జాలములు
పసమీర గలిగిన — బ్రహ్మాండ తతులు
చూచితి, నటుగాన — సుతుడు వీడనుచు

---

* యశోదాకృష్ణుల సంవాద మిందు వర్ణింపబడినది

1 'ఛీ ! పీడ' అని యర్థము

2 'తింటూనావే ?' — అనగా 'తిననే తిన' నని భావము

చూచుట దోష, మ — చ్చుగ వీడు పరమ
పురుషుం డనుచు నెంచి —పూజించి మ్రొక్కి
పరమ పదంబున — ప్రాపింపవచ్చు
పర్బకుడని వీని — నల్లిబిల్లిగను
నిర్భయంబున నెత్తి — నే సాకుచుంటి
నాపాలి తరిగొండ — నరసింహు డితడు
పాపడుగాడన్న, — బలభద్రు తల్లి
తనలోనె తా నద్భు — తంబు నొందుచును
దనరార నాయశో — దకు నిట్లు లనియె

ఆ వె భ్రాంతిపడితివేమొ బాలుని వదనమం
దిన్ని గలిగియుండు టెందు గలదు ?
పరమ పురుషు డేడ ? పసిబిడ్డ డేడ ? నీ
వుప్పతింపవలన దో యశోద !

వ అని పలుకుచున్న తల్లులమీద వైష్ణవమాయ గప్పి, పూర్వ నిశ్చయంబును మరపించి, కృష్ణుం డాట్లాడుచుండె. నంత నొక్కనాడు యశోద పెరుగు జిలుకుచుండగా కృష్ణుం డిట్లనుచున్నాడు

## దరువు (కావిరి)

అమ్మయ్యా చాచీవే ! నా బా — జ్జంతా వారెనూ[1] ॥పల్లవి॥
పెరుగు, గుమ్ము గుమ్మమంతా చిలుకు — కుంతావుంతే యెత్తనే ?
॥ వో యమ్మయ్యా ॥ఉ పే ॥

మజ్జిగా చిరాకవద్దు — మంచామమీదా గూచుంది[2] ॥యమ్మయ్యా॥ 1

వులులుక్కి పానూలు జేత్తా — వుంతే కోపాము వత్తుంది॥యమ్మయ్యా॥ 2

తరిగొందాచామితోరే ! నే — తాళలే నాకాటిచాత ॥నమ్మయ్యా॥ 3

---

1 'వాడెను' అని యర్థము

2 'గూర్చుండి' అని యర్థము

## వెన్న దొంగ

వ. అని కవ్వంబు బట్టి చిలుకనియ్యక చలంబుజేసిన, కొడుకును తొడపై నిడికొని చన్నిచ్చు సమయంబున పాలు పొంగిన చల్లార్చుటకు కొడుకు నందుంచి యశోద లేచిపోయిన, కృష్ణుండు దధికుంభంబులో వెన్నమెక్కి తత్కుంభంబు పగుల నడంచి, పొరుగింటి కురికి వారి వెన్నముద్దలు మెక్కుచు కోతి కిచ్చుచున్న సమయంబున పోయిచూచి యశోద యిట్లను చున్నది

ద్విపద ఓరి ముద్దులవాడ! — యోదుండగీడ!
యోరోరి! తరిబాన — యొప్పులు[1] జేసి
వచ్చి నవ్వుచు నూరి — వారింటి వెన్న
నుచ్చిలింపుచు కోతి — మూతి కిచ్చెదవు
చిన్నవాడని కొట్ట — చెయ్యాడ కేను
నిన్ను మన్నింపగా — నీ వింత మించి
తలకొని గోపకాం — తలు జెప్పినటుల
చెలరేగి దుడుకులు — జేయుచున్నావు
సహజ బాలుడ వీవు — సర్వదా గావు
మహిమల పోకిళ్ల — మారి వైనావు
గుణము చేపట్టక — కొడికెక్కినావు[2]
గుణశాలివోలికె — గునిసియాడెదవు
గుణివియు గావు, ని—ర్గుణుడవు గావు
గుణహీన! నిన్నెట్ల — గురిసేయవచ్చు?
గణుతించి యేవేళ — గాచుకయుండి
క్షణ మేమరితినైన — జరిగిపోయెదవు

---

1 'వ్రప్పులు' అను దానియొక్క వ్యావహారిక రూపము 'వప్పులు' అనియు నందురు ఉదా టెంకాయ వప్పలు

2 'కొడి' యనగా 'అగ్రము, పై భాగము' అని యర్థములు (చూ బ్రౌణ్య నిఘంటువు ప్రథమ ముద్రణ, పుట 272)
'కొడికెక్కుట' యనగా 'పరాకాష్ఠ నందుట' యని తాత్పర్యము.

చిక్కించుకొనను పొంచిన వారికెల్ల
చిక్కుదువా నీవు ? — చిక్కులమారి !
చిక్కితి విపుడు నా — చేత బొంకించి
యెక్కడ బోయెద — వింక మీదటను ?
పెట్టు సంజీవియో — బిడ్డలకెల్ల
పెట్టు(న) గాని చె — ప్పినమాట వినరు
తాళుతాళుర ! నిన్ను — తాటించునట్టి
వేళ వచ్చునటంచు — వెరపించి పలికి
తనచేతి సెలగోల — తగ ఝళిపించి
పనిబూని కృష్ణుని — పట్టబోయినను
తరిగొండహరి యశో — దకు చాల వెరచి
పరువు బారుచు, బగ్గ — పడుచు[1] నిట్లనియె

## దరువు

అమ్మా ! నన్నూ కొత్తారాకవే ! ॥పల్లవి॥
అమ్మమ్మ యశోదమ్మా ! నన్ను కొత్తరాకవే !
నేను, సమ్మతమునా యింతోనే దాచి దాగుచుంతాగాని
॥అమ్మా ! నన్నూ ॥ఉ ప ॥

పొందుగా పాచాలుబువ్వా — బొజ్జనిండా బెత్తితే నే
నెందు బోకా యింతో వుంతా — నే ! అమ్మ యశోదమ్మా !
॥అమ్మా ! నన్నూ॥ 1

'చిన్నావారా ! ర'మ్మనుచు — చేతిలో నీవు బెత్తినా
వెన్నాముద్దా దింతావుంతా — నే ! అమ్మ యశోదమ్మా !
॥అమ్మా ! నన్నూ॥ 2

వూరీవారీ యింతికి నే — నోలల్లా ! పోలేదుగాని
వూరీకె యింతోనే వుంతా — నే ! అమ్మ యశోదమ్మా !
॥అమ్మా ! నన్నూ॥ 3

---

1 '(బలిమాలుచు' అని యర్థము ఈ యర్థమున 'బంగపోవు' అను వ్యవహారము నేడును కలదు

మాత్రాటుతా లన్నతోను — చిత్తాబత్తా కాయూరాచు
తొత్తులోనే నూగుచుంతా — నే! లమ్మ యశోదమ్మా!
॥అమ్మా! నన్నా॥ 4

నా తోరే! శీతరిగొందా — నారదిమ్మచ్చాని రోరే!
ని తోరే! నే దురుకు చాయు - నే! అమ్మ యశోదమ్మా!
॥అమ్మా! నన్నా॥ 5

వ అని వెరచి యురుకుచున్న కొడుకును తరిమిపట్టి, కొట్ట చెయ్యాడక రోటెకి కట్టివేసిపోయి, గృహంబులో పనులు వేయుచున్న సమయంబున

## నలకూబర మణిగ్రీవులు

ద్విపద హరి రోట బద్ధుడై — యుండిందు జూచి
వెరచినట్లనె యుండి — నేగ రో లీడ్చి
మును నారదు శాప — మున మణిగ్రీవు
డనువాడు, నలకూబ — రాభిధానుండు
సంగడి సుద్దులై — జనియించియున్న
సంగజగురు డప్పు — డా రెంటి నడుమ
దూరి రోలీడ్వ, మ — ద్దులు గూలె నందు
నేరుగా నమ్మహా — వృక్షరాజముల
లోనుండి సిద్ధు లా — లో వచ్చి మ్రొక్కి
యా నీరజాక్షున — కపు డిట్టు లనిరి

## దరువు

దండమూ స్వామి! దండమూ ॥పల్లవి॥
పుండరీకాక్ష! బ్రహ్మాండ భాండోదర! ॥దండమూ॥అ ప॥

నీపాదములు సోక — గా పాప మణగె, మా
శాపము దీరె నో — గోపాల విగ్రహ! ॥దండమూ॥ 1

1 'కొట్టలో' అని యర్థము

మునుపు నారదు శాప — మున వృక్షరూపము
లను బూనియున్న వ — మ్మెనసి ప్రోచిన స్వామి! ॥దండము॥ 2

తరిగొండాధిప! శేష — గిరివాస! నీపాద
స్మరణ మా కొసగు భా — స్వర సచ్చిదానంద! ॥దండము॥ 3

వ. అనిన విని హరి సిద్ధులతో నిట్లనుచున్నాడు

ద్విపద వినుడు గుహ్యకులార! — విశదంబుగాను
మనుజులు దుర్మదో — న్మత్తులుగాక
తమ తమ ధర్మముల్ — దప్పక సర్వ
సముడౌను నను నమ్మ — శాంతచిత్తులకు
అలర సాక్షాత్కార — మై కర్మబంధ
ముల ద్రెంచి, యొసగుదు — మోక్షంబు; నన్ను
తలచనివారి కె — దలచ నెన్నటికి
ఎలమిత హృదయుడై — చరియించు దేవ
మునివాక్యమున జేసి — మొనసి నన్ దలచు
మనము మీ కబ్బె; ని — ర్మలులైతి రింక
జనుడన్న, తరిగొండ — స్వామికి మ్రొక్కి
చనిరి వారలు ధనే — శ్వరుని దిక్కునకు

వ. అప్పుడు వృక్షంబులు పడిన చప్పుడు విని వచ్చిన నందాదులు అందున్న వారితో నిట్లనుచున్నారు

ఆ వె గాలి వీచలేదు, ఖండింపగా లేదు;
నేల వృక్షయుగము నేడు పడుట
కేమి హేతు? విప్పు డీచ్చట జూచిన
బాలులార! తెలియబల్కుడిపుడు

వ అనిన విని అందున్న బాలకు లిట్లనుచున్నారు

ఆ వె బాలకృష్ణు డిపుడు రోలీడ్చుకొని చెట్ల
నడుమ దూరి రాగి, పుడమిమీద
గూలె మద్దు లన్న కుర్రల వాక్యముల్
దబ్బరనుచు నవ్వి తడయ కపుడు

ద్విపద ఆ నందగోపకు — ఁబ్జాక్షు జేరి
పూనిన జాలితో — పొసగ నిట్లనియె
చక్కని తండ్రి ! యి — చ్చట నీవు చెలగి
చిక్కవం డెవ్వరి — చే, తల్లిచేత
చిక్కితివే నేడు — చిన్నారి కృష్ణ !
ఇక్కడ రమ్మంచు — నెదను జేర్చికొని
నెనరు రెట్టింపగా — నెమ్మోము నిమిరి
తనయుని కట్టు న — త్తరి తాను ఏడ్చి
ప్రియము దీపింప నా — బిడ్డ నెత్తికొని
దయమీఱ నా యశో — దాదేవి కిచ్చి
జిగిమీర కృష్ణుని — చెక్కిళ్లు నిమిరి
నగుమోము దీపింప— నందు ఁట్లనియె

## దర్వు*

దిట్టాతనమున ముద్దు — పట్టి మొలకు తాఁు గట్టి
కట్టాడి ![1] నీవెందు కిట్లా — కట్టిస్తివేవే ? 1
వారీవీరి యిండ్లు జేరి — దూరు దెచ్చితే నే ఏసి
గారావింపక నీ రోట — కట్టిపెడిలినీ 2
తాడూ గట్టిన బొజ్జంత — దద్దు గట్టె నిందూ జూడు
చేరే ! యింత ఓగ్గా గట్టు — చెయ్యెట్లాడెనే ? 3
దుండాగీడై పొరుగిండ్లాలో — దొంగిలించితే యీా సారి
గంఁరాజీవు లుండే ఏాన — కట్టివేతునా ?[2] 4
నన్ను గన్నాతండ్రి ముద్దు — చిన్ని బొజ్జ నాడీవుంది
మన్నించి నీ వింకనైన — వెన్న బెట్టవే ! 5

* ఇది నందయశోదా సంవాదాత్మకము

1 'కట్టడి !' — 'కఠినురాలా !' అని యర్థము

2 ఈ ప్రశ్నార్థకమునకు 'తప్పక కట్టివేయుదును' అని భావము

పన్నుగ యెవ్వారిండ్లకు — నన్ను విడిచిపోకవుంచె
వెన్న పెట్టగాని, పోతే — వెన్న బెట్టవా 6

నా పాలి శ్రీ తరిగొండ — నరహరి వరముచేత
నీ పాపడు పుట్టె - నా డిట్లెంచుకనేవే ? 7

ద్విపద అనుచు నందుడు బల్కె — నా గోపదేవి
కనుగీటి నగి, పతి — గాంచి యిట్లనియె
ఎడు దుష్టై మన — వెన్న బానంత
నేడు వప్పలు వేసి — గెంతుచు పొరుగు
వారి యింటికి బోయి — నైపుగా చేతి
కారటుగా వెన్న - యుట్టందకున్న[1]
రోలు దొరలగవేసి — రూఢిగా నెక్కి
మేలుమేలని యుట్టి — మీదటి వెన్న
ముద్దులు మర్కట — మున కిచ్చి, దాని
ముద్దు జూచుచు నందు — నురియుచుండగను
వెనువెంట నే బోయి — వేగ జూచితిని
ఏనయువారి గరితలు — మాటి మాటికిని
క్రమముగా నీని దొం — గతనంబు నాకు
గెరల జెప్పుచునుందు — రదియెల్ల కల్ల
యనుచు నిన్నాళ్ళు కొ — ల్లాడుచునుంటి
కనుగొంటి నీని దొం — గతనంబు నేడు
కావున బూచి కే — క్రమమునవైన
నే నీని బట్టిత్తు — నిశ్చయంబుగను
హెచ్చరికన్ జెప్ప — డింక మీరనుచు
ముచ్చటగా బల్కె — ముదితను జూచి
తనలోన నగుచు మో — దమున నందుండు
ననునడు తరిగొండ — హరి కిట్టు లనియె

1 'ఉట్టి+అందకున్న' అని విభజనము

నే నవ్వితే తా నవ్వుతారమ్మా!
నే కొత్తబోతె, తాను నన్ను కొత్తవత్తారమ్మా! 2
నే నొంగితే తా నొంగుతారమ్మా!
నేను లేత్తేను, తాను లేచ నిలువబరతారమ్మా! 3
నెను జాత్తే తానూ జాత్తరమ్మా!
నే వెక్కిరిత్తె, తాను నన్ను వెక్కిరిత్తారమ్మా! 4
అరిగొండ నారాచిమ్ము రోయమ్మా!
యా బూచవాని, తరిమి తరిమి కొత్తవాలెనమ్మా! 5

ద్విపద అమ్మయ్యా! బూచివా — రా నీళ్ళరోను
నెమ్మరిలో నేరు — నిలిచియున్నారు
అల సాయబూచీని — అనం బోగొత్తి
సెలపక యానీళ్ళ — జూసవే నాకు
లంపు వారుందక — నావల ఒనిన
నిందు నే నుందు, నా — రిందుందెనైన
నిక్కంబుగా నిందు — నే నుంద వెరతు
తక్కక తరిగొంట — దాయితోరమ్మా!

## దరువు

అబ్బబ్బా బూచికి వెరతునమ్మా!—యచోదమ్మా! వో యబ్బబ్బా! ॥పల్లవి॥
ఆ బూచీవా రింతా వుంతే — యారానైనా పొంచి వచ్చి
నా బొళ్ళంతా కరిచిపొయ్యా — నమ్మా! యచోదమ్మా! వో ॥యబ్బబ్బా॥ 1

నాపాదానే కన్ను బెత్తె — నన్ను వారు చూచుతారు
నా మేనంతా ఏనుకూచున్న — దమ్మా! యచోదమ్మా! వో ॥యబ్బబ్బా॥ 2

నాపాలి తరిగొండ — నారచిమ్మచ్చామీ వాని
చూపురోనే కానిపిత్తా — రమ్మా! యచోదమ్మా! వో ॥యబ్బబ్బా॥ 3

ఆనె అనుచు భీతి నొందినట్టి కృష్ణుని జూచి
నవ్వి యా యశోద 'నన్ను గన్న

వాడ! నిన్ను గొట్టవచ్చిన బూచివా
డెట్టివాడు? వెరవ కపుడు జెపుము'

ద్విపద అని గోపిదేవి అ — న్నంగిని, కృష్ణు
డనుచుండ నిట్లనె — నా బూచివాడు
అచ్చవైనటువంటి — యాణిముత్యముల
కుచ్చులు, బంగరు — కుచ్చులు మెరయు
కరమొప్ప నొక కొండె[1] — గట్టుకున్నాడు
తరుణమగా వెల్గు ము — క్తాఫలాపంబు
ధళధళ్యముమీరం — ధరియించినాడు
జాళువా తళుకుల — నందిదండయును
దంరార నాగలం — ధము, కంకణము
లును, మణిముద్రిక — లును దాల్చినాడు
వరదీప్య మణిహార — హారంబు తోడ
అరిపెణ పులిగోరు[2] — సవరించి, బొట్టు
వెలిగింప[3] మెరనిండ — వేసుకున్నాడు
తిలకంబు చొగసుగా — దిద్దుకున్నాడు
బంగారు 'దరికట్టు'[4] — బంధించి, దాని
చెంగుల పూలకు — చ్చులు గట్టినాడు
లోచన యుగళి పై — రొంటి దన్ను
చూడువారిని తాను — చూచుచున్నాడు

1. రాజులు పోవగువారు మొగముతట్టు వేసకొనెడు వెంట్రుకల ముడి (చూ. శ.ర. పుట 197)
చిన్నపిల్లలకు ముఖమువైపు వేసి చుట్టెడి జడను 'కొండె' యందురు. 'కొండెజడ, కొండెసిగ' మొదలగునవి దీని పర్యాయ పదములు

2. 'పులిగోరు చేర్చిన సరిపెణ (బంగారు గొలుసు)' దీనినె పులిగోరు పతకమనియు నందురు

3. ఇచ్చట 'వెలిగింపన్' ప్రేరణార్థకము కాదు. ఇది 'మేలిల్లు, రంజిల్లు' అనువానివలె స్వార్థకము. 'ప్రకాశింపగా' అని యర్థము

4. 'నడికట్టు'

త॥ చింతమాని తేనైన — త్రాగేవటరా కృష్ణా ?
నీవు, త్రాగేవటరా కృష్ణా ?
తియ్యగా తేనే, వెన్నైత్తే – తింటానే గోపెమ్మా ! 3
వెన్న వద్దు, తేనియ త్రా — వించే రార కృష్ణా !
త్రా, వించే రార కృష్ణా !
యన్నా ! పాత్తి తేన దాగే — దెత్తానె గోపెమ్మా ? 4
పిప్పిళ్ళతోడి తెనె ఉని — పించే రారా కృష్ణా !
(తిని, పించు రారా కృష్ణా !)
అప్పప్పా ! కారము దిందు — రంతానే గోపెమ్మా ? 5
గురుతూగా పిగడ, పాలు — గ్రోలేవటరా కృష్ణా ?
పాలు, గ్రోలేవటరా కృష్ణా ?
తరిగొండాహరితో రేనది[1] — లాగేనే గోపెమ్మా ! 6

## కాళీయుడు

వ॥ అనిన విని నవ్వుకొనుచు యశోద గారవింపుచుండె, నంత కృష్ణుం డట్లనేక బాలలీలలు జూపుచు, బృందావనంబున లేగల మేపుచు, వత్సబకాసుర ప్రముఖ రాక్షసులం జంపుచు విహరింపుచుండి, యొక్కనాడు గోగణంబుల దోలుకొని కాళింది మడుగునకు బోయి, కాళియ విషకలితతోయంబులం ద్రావి సొలిపడియున్న గొల్లల, బాలకుల మరల బ్రతికించుకొని నందకు వచ్చునం జూచి, తద్వృత్తాంతంబు విచారించుకొని భీతిల్లి యశోద కృష్ణునితో నిట్లనుచున్నది

## ఏలలు*

మాతండ్రి కృష్ణా ! కాళింది — మడుగూదిక్కూ పోవద్దండా
పాతాకాసర్ప మున్నాదిరా ! వో ముద్దూకృష్ణా !
— పైకి బుస్సూమాని ఉగసీరా ! 1

1 'హరితోరు+ఏను+అది' అని విభజనము

* ఈ యేలలు యశోదాకృష్ణ సంవాదాత్మకములు

నమూ నేరా వినాగానే — భయమూ సందుచుండూగానా
నే నింటి యుండేలా పొర్సనే । ఓ యశోదమ్మా ।
— నీ వాజ్జాలో ఉగ్గినుండానే । 2
సిరికీవాడవూ నాతండ్రీ । — పరగ పసుల మేపే నంటా
పరువూబారుచూ పోవద్దు రా । నామురద్దూకృష్ణా ।
— పట్టుగా నా చెంతా నుండారా । 3
తరిగొండా నారసింహుని — మరుగానా నే నుంతా గానీ
పెరుగూచున్నా శాన వెట్టానే । ఓ యశోదమ్మా ।
— పెద్దవాణ్ణిగా నే పెరిగెనే । 4

ద్విపద అనుచు మాయలమాట — లాడి, గొల్లెమ్మ
మనము రంజిలజేసి — మధుసూదనుండు
మరునాటి వేడ్క — నెమ్మడువున కరిగి,
తెరచి బాలకులు ని — ర్విణ్ణులై చూడ
సరిలేని బంగరు — వలడంబు దొడిగ
సరిగ కుచ్చులతోడ — చాల వెల్గుచును
దట్టమై తగు పట్టు — ధట్టి బిగించి
దిట్టయై యంచి త — త్తరంబునందు
ప్రబలిన ఘన కదం — బక భూజమెక్కి
ప్రబల కంఠీరవ — రూపమున నెగసి
క్రోధంబుతో మహా — కుధరం బసిరాడ్కి
మాధవు డప్పుడ — మ్మడువులో దుమికె

ఇట్లు దుమికిన బాలకృష్ణుని కాళియోరగుండు గరచి యతని దివ్యదేహం బునకు చుట్టుక నియుండె, నందా యశోదాదులు అచటికి వచ్చి, పాముచేత చిక్కి కదలకున్న హరిని జూచి, అందు గోపగోపికా వ్రాతంబులు వాపోవుచున్నం జూచి రోహిణీయశోదలు తత్తరంపడుచు నిట్లనుచున్నారు

## దరువు

పాముచేత చిక్కినాడు — బాలుడూ, మొదల డింక
ఏమి సేతామమ్మా ? మన — మేమి సేతామే ? 1

కట్లకట్లాపాము నేను — చుట్టచుట్టనాది, బిడ్డ
న న్నా[1] యుండగాను పైట — కెట్లా చిరినే ? 2
తరిగొండస్వామి ! ఏని — దయతోను రక్షించు మాని
ఇరువొప్ప కరములెత్తి — మొక్కుకొందానే ! 3

ద్విప॥ అని ఎల్కి మరియు దుః — ఖా క్రాంతయగుచు
కనుమూసి మెదలని — కనులలోచనుని
గనుగొని పల్కె ర — క్కట ! కృష్ణ ! నీకు
మునుపు వచ్చిన గండ — ములు దప్పిపోయె
ఇంపట కీ పాము — గాచుకయుండె
నగర నేటికి పైన — మైన లేదయ్యె
బాలక ! నిన్నిది — ఒట్టిన వేళ
చాల వొత్తిలితివో — సంకటపడితె ?
తామరసాదర ! — తలచితె మమ్ము ?
ఏమిసేయుదుము ? నే — మెట్లు తరించుదుము ?
పామంపు పెనుబాము — పట్టె నమ్మెన
కాసించ కరువక — క్రూర ! నిన్నేల
గరచె ? నీవుండినా — క్రమ్మర మమ్ము
కరుణచే బ్రతికింప — గలవు మేముండ
నిను బ్రదికింపగా — నేర మో తండ్రి !
యనఘాత్మ ! తరిగొండ — హరియైన శేష
శైలనాయకుడు మా — జాలి తా దెలిసి
బాలక ! నిన్నిందు — బ్రదికించవలెను !

వ అని పల్కి రంత రిప్పి యశోద యెట్లనుచున్నది

## దరువు, ఆదితాళం

నా చిన్ని కృష్ణ ! — నా యన్నా ! ॥పల్లవి॥
నా చందంబున — నీ నీరముతో
నీ వెంపమున — కెటు జిక్కితివో ?
॥ నా చిన్ని కృష్ణ ! ॥ ॥అ.ప॥

1 'నన్నే' అని యుండిన అర్థము మరింత సుగమ మయ్యెడిది

కటకట ! నిన్నీ — కాకోదర మిపు
డిటు చుట్టెను, నే — నెటు విడిపింతుర ?
॥ నా చిన్ని కృష్ణా ! ॥ 1

నీ ముద్దులు, మరి — నీ జిగి సుద్దులు
నీ మురిపెంబులు — నే నెటు మరతుర ?
॥ నా చిన్ని కృష్ణా ! ॥ 2

తరిగొండ నృకే — సరి కరుణను మా
వెరపు దీర్చి నిను — విడిపింపగలె
॥ నా చిన్ని కృష్ణా ! ॥ 3

ద్విపద అని యివ్విధంబున — నపుడా యశోద
యును నెందు తా సుతు — నొయ్యన గాంచి
'హా వంశ భూషణ ! — హా నోముఫలమ !
హా వీర ! హా ధీర ! — హా సత్కుమార !
మున్ను రాక్షసి వచ్చి — మోసంబు జేసి
చన్ను బాలనుచు వి — షంబిచ్చినపుడు
విష విజయుండవై — వెరవని నీకు
విషధిశయున ! సర్ప — విషమెక్కె నకట !
నీ మంజు భాషలు — నీ వినోదములు
నీ మన్ననలు జూడ — నే డెందు బోదు ?
మా జోరి లేక ని — న్మాడ్కి మైమరచి
యీ జల మధ్యమం — దిట్లున్న నిన్ను
కనుగొనుచుండియు — కాయముల్ విడువ
మనఘ ! మాయంత క్రూ — రాత్ములు గలరె ?
బిడ్డలు లేకనే — పృథ్వీతలమున
గొడ్డాల[1] మనిపించు — కొనియుండి, తుదకు
నీవంటి సత్కృపా — నిధిని పుత్రకుని

---

1. 'గొడ్డు + ఆలము' అని విభజనము ఇది ఉత్తమ పురుష బహువచనము 'ఆలు' శబ్దము పరమైనను, రుగాగమము రాకుండట ఇందలి ప్రత్యేకత

గా వేడ్కతో మేము — గన్నంత కేమి
గట్టు కొంటిమి? యింత — గలిగి నీవేమి
గట్టుకొంటివి? కట్ట — కడ కెట్టులయ్యె
మా ముద్దులయ్య! వా — మన్నారు కృష్ణ!
ఏమి సేయుదము? ని — న్నీ చిన్నవాడె
పాపాత్ములము మేము — పశువుల వెంట
నేప నంపితిమి నీ — చే పోర్వలేక,
మాకేల పశువులు? — మాకేల బ్రతుకు?
మాకేల తనువులు? — మాకేల సుఖము?
†కొడుకక వెంటనే — గనిపోవు మమ్మ'
అని పల్కి యిరువురు — హా! యని యేడ్వ
మానవులు హరియుండె — మగ్నముల్ జేసి
'పదపద మనవులో — బడుద' మటంచు
పదరి పోవుట జూచి — బలు డిట్లు లనియె

ఆ వె. తల్లిదండ్రులార! తత్తరముగ వీరు
మడువులోన బడుట మంచిదగునె?
పాము నదరదట్ట పద్మాక్షుడిక వచ్చు
చూచుచుండు డింక శోకపడక

## దివ్య నాట్యము

ద్విపద అని పల్కుచుండగా — నంత బాలుండు
తన దేహమును బెంచ — దండశూకంబు
చుట్టిన చుట్లు వీ — డ్పుచును, తత్పుచు
మట్టహాసంబుతో — సరి చెట్టి

† ఈ పంక్తికి ముందుండ వలసిన పాదమొకటి లేఖకుని ఏమరుపాటువలన లుప్తమైనట్లు వ్రాసినబట్టి స్పష్టపడుచున్నది

గిట్టచై గిరగిర — ద్రిప్పి యుచ్చోటు
గట్టిగా బడవైచి - పునతర యమున
లోపల నించు క — ర్లోల ఘోషంబు
లాలితమగు మర్ద — ళ ధ్వనిగాగ
బృందావనములోని — భృంగాళిమోత
క్రంపైన గాయక — గానంబుగాగ
కలహంస శుక పిక — కలకల ధ్వనులు
సలలితమగు తాళ — శబ్దముల్ గాగ
నాకమందుండి యా — నంద మింపొంద
జోకతో జూచెడి — సుత్రామముఖులు
సరసులై వీక్షించు — సభ్యులుగాగ
సురుదివ్యమణిపట — లోజ్జ్వల కాంతి
మహిత కాళీయఫణి — మంటపమందు
బహువిచిత్రంబుగా - ఎటునటుభంగి
నటియించె వేల్పు లా — నంద మింపొంద
తటుకున భేరికా — ధ్వనులు మ్రోయించి
కుసుమముల్ వర్షించి — కోలాహలముల
వెస ఘటించిరి తాళ — విధి దప్పకుండ,
వర తరిగొండ ని — వాసుడై శేష
గిరివాసుడగు బాల — కృష్ణుడు సల్పు
వింత నాట్యమునకు — వెరగు నొందుచును
సంతోష మొందిరి — సకల యాదవులు

## దర్బు, ఆదితాళం

ఆడెనే! కృష్ణు — డాడెనే! ॥పల్లవి॥

పాడుచు నా గో — పకు లందరు తన
వేడుక జూడగ — వింతగ నగుచూ ॥ ఆడెనే ॥అ.ప.॥

తతకిట తకఝుం — తదిగిణ ధిమిత యని
గతులు[1], చొల్లు[2] లను — ఉత్తమముగ మెరయగా ॥ఆడెనే ॥ 1

చెలరుచు చిరు గ — జ్జెలు, నూపురములు
ఘలు ఘలు ఘలు ఘలు — ఘల్లని మ్రోయగా ॥ ఆడెనే ॥ 2

ధాధా ధణంధణ — ధగేత యనుచు గీ
ర్వాణులు నభమున — వరుసగ బొగడ ॥ ఆడెనే ॥ 3

మణిభూషణములు — మరి మరి కదలగ
ఘణ ఘణ యని మొల — ఘంటలు మొరయగా ॥ ఆడెనే ॥ 4

తారి తకిణఝుం — తకకిణ తకఝుం
తారి తకిటతక — తాత్తై యనుచూ ॥ ఆడెనే ॥ 5

వర తరిగొండ ని — వాసుడు వేంకట
గిరి నిలయుండగు — కృష్ణుడు చెలగి ॥ ఆడెనే ॥ 6

## శరణాగతి

ఉ అప్పుడు కాళియోరగుని యంగన లా విధమెల్ల జూచి, బల్
తప్పెను కార్యమంచు పరితాపము నొందుచు కృష్ణపాలికిన్
జెప్పున వచ్చి మ్రొక్కి, బహుదీనత నొందుచు పల్కిరిట్లు మా
ఒప్పు సహించి, కృష్ణ! యిక తాండవమాడక నిల్పిపోవవె!

వ అని మరిన్నిట్లనుచున్నారు

---

1 నాట్యమున తాళానుగుణముగా అడుగు వేయుటకు 'గతి'యని పేరు ఇది I ఏకసరగతి II ద్విసరగతి III త్రిసరగతి యని ప్రధానముగా మూడు విధములు ఈ త్రివిధగతుల లక్షణములకు చూ నృత్తరత్నావళి, VIవ అధ్యా, 181–184 శ్లోకములు

2 'శొల్' అను ద్రావిడ శబ్దము దీనికి మూలము 'చొల్లు' అనగా 'తతకిట, తధిగిణ' వంటి వాద్యజతులు (Rhythm-syllables) నాట్యసందర్భమున వీటిని ఉచ్చరించుట (Oral recitation)ను నృత్తరత్నావళీకారుడు 'వక్త్రవాద్య' మని పేర్కొనెను (చూ నృత్తరత్నావళి, VIIవ అధ్యా, 12 శ్లో)

కరుణించి, తెమ్మని — కాళియోరగుని
శిరములపైనుండి — చెచ్చెర దుమికి
యలఘుశాంతి వహించి — యాత్మ మోదించి
కలికికృష్ణుం డొక్క — కడ నిల్చియుండె

వ అంత కాళియోరగుండు హరికి మ్రొక్కి ఆపచారక్షమజేసికొని తన కాంతలతో నిజస్థానంబు జేరె. నంత రామకృష్ణులం దోడ్కొని నంద యశోదాదులు గోష్ఠంబునకు జని యుభస్థలి నుండి. రందొక్కనాడు హరి బృందావనంబులో నిల్చి వేణుగానంబు జెయుచుండగా విని గోపకాంతలు వారి కెదురుగా బోయి తనుపో దా మిట్లనుచున్నారు

## మురళీగానము - గోపికల ఆరాటము

ద్విపద సుందరీమణులార! — చూడు డీ దిక్కు
బృందావనంబులో — ప్రియుడైన నంద
నందను డిప్పు డా - నందించి, మునుకు
కందర్పుడై పూర్ణ — కగలతో వాము
భాగానతానన — పద్మంబు గదుం
బాగుగా డాకారి — పై సాచినట్టి
చరణనఖద్యుతుల్ — జగతిపై నిండ
శిరమున నవరించు — శిఖిపింఛమాల
అల్లాడ, ఘనకంఠ — హారంబుతోడ
మల్లాడు[1] నవమాన — మాలికల్ వీడ[2]
చెలగి కర్ణావతం — సిత కర్ణికార
కళ దివ్యగండభా — గప్రభ మెరయు
కరపంక జాంగుళీ — ప్రకరనటనంబు

1 'మల్ల+ఆడు' అని విభజనము 'పెనగాడుచున్న' అని యర్థము (చూ. శ. ర. పుట 609)

2 'విడ్చుకొనగా' అని యర్థము

సరస స్వరౌఘ భా — స్వర సర్మంబుల
జూప, భ్రూయుగళంబు — శోభిల్ల, వార
చూపులతో[1] లోక — సుందరమూర్తి
యాదవపై తగ వేడ్క — నధరంబునందు
పొందించ యూదుచు — భూరి శృంగార
రస ముప్పతిల్ల, నవ్య — రాగానుసరణ
నెనరు నటియించి — బహుతాళగతుల
పనమీది నత్క్రాప — మానసమందు
పెనగొన కన్నులు — బెళికించ[2] నగుచు
చూచుచున్న దృ — సొగసు చూచితిరె
వాలి వదినరే — సుందరులార!
శ్రీ తరిగొండ నృ — సింహుని మోవి
నీ తీరుగా నెంచు — యెడబాయకుండ
మురళి యామునతట — మ్మున నిల్చి మున్ను
చిరముగా తపమేమి — చేసెనో యమ్మ?

## దరువు*

ఏమి తపము చేసెనమ్మా? — యీ మురళి పూర్వ
మేమి తపము చేసెనమ్మా? ॥పల్లవి॥

సోమాంబరు నెపు — డెడబాయక తగ
వేమరు హరిమో — విని బొందెదనని ॥యేమి తపము॥ఉ.ప.॥ 1

మునులకైనను బొంద — రాని ఘనతరపదవి
మురళి కెక్కడ వచ్చె పూని?
వనసిధి సుతకై — నను గలుగుట లరు
దని జను లెన్నుదు — రపురగ ధరపై ॥ఏమి తపము॥ 2

---

1 'ప్రక్క (ఓర) చూపులతో' అనగా 'కడగంటి చూపులతో'నని యర్థము.

2 'తళతళమని ప్రకాశింపజేయుచు' అని భావము

* ఈ దరువులో ప్రథమ చరణమందలి తొలి రెండు పాదములు పల్లవిగను, మలి రెండు పాదములు ఉపపల్లవిగను పేర్కొనబడియుండుట గమనింప దగినది

తరిగొండ నారసింహు — డైనా శేషాద్రి విభుని
కరుణ దానికి గల్గెగానా
హరి యధరామృత — మిగవుగ గ్రోలెడి
గురుతర భాగ్యము — దొరికెను నిజముగ ॥నేమి తపము॥3

ద్విపద ఓయమ్మలార! యిం — కొకమాట వినుడి
మాయా ప్రపంచ ధ — ర్మముల బోనాడి
సారంబులేని సం — సారముల్ విడచి,
శ్రీరమాధిపు జేరి — సిగ్గులు విడిచి
'యేలుమి పద్మాక్ష! మ — మ్మెనయ ర' మ్మనుచు
పిలుతమా సఖులార! — ప్రియభాషణముల,
కాముమార్గణముల — కనులకో నుంచి
తామరచక్షు చి — త్తము గరిగించి
చూతమా సఖులార! — సొగసుల మించి,
నూతనమైన వి — నోదంబు కొంత
జేతమా సఖులార! — చిత్తముం డలర
ప్రీతితో కృష్ణుని — బింబాధరంబు
గిరుతమా సఖులార! — కౌగలిమ్మనుచు
కరములుసాచి యా — ఘనుని చేపట్టి
మురుతమా సఖులార! — ముద్దులుబెట్ట,
సరసంబు లాడుచు — జలజాక్షు వెంట
పోదమా సఖులార! — భూధరంబులకు
నేడియు వెలియ కి — ట్నమ్మహామహుని[1]
చెనకిన, మనల మ — చ్చిక గనునట్టు
తనవారమని చాల — దయజేసెనేని
సరి దయలేక ర — చ్చల బెట్టెనైన
వరుసగా మన మగ — వారు ప్రాణములు
ఆరింతురా? మన — మటు జేయదగునె?

---

1 'ట్నమ్మహామహుని' అని యుండిన యతిమైత్రి కుదురును.

శౌరిని మోహించినావుగా — జాలిచె రాళలెను
నీరజాక్షుడు నా పాలు — నిలిచె చెంత మోహింపవే!

॥ శైలజాతా ! ॥ 2

శ్రీకరా తరిగొండా — శ్రీ నరహరి యుండా
నాకు నీవు గలుగజేసి — ఎన్నించు శ్రేయస్సము నీకు

॥ శైలజాతా ! ॥ 3

ద్విపద ఓ తల్లి ! కల్యాణి ! — యుర్వీధరేంద్ర
బాల ! జగన్మాత ! — సద్గుణోపేత !
భగవతి ! మా తల్లి — పద్మలోచనుని
మగనిగా వెయుము — మధుసూదనుండు
మునుపె వెనుక ని — న్నురుల పూజించి
అగ నేతితో నన్నం — బంబు లొసగుచును
చెలగి జాతర[1] నీకు — జేసెద ననుచు
బలికి, హవిష్యంబు[2] — భక్షించి యుట్లు
పరువము నప్పుడి — మాసవ్రతంబు
నరనాథ ! యుండొక్క — నాడు ప్రొద్దునను
క్రమమొప్పగ — గోపకాంతలెల్ల
యమునా తరంగిణి — కరిగి యొక్కెడను
ఏకాంతమున పెక్కు — నెరసి చేలములు
ప్రకటంబుగ తీర — భాగంబునందు
రాశిగా నుంచి ని — ర్వాణులై, వారి
డసె [3]యన్యోన్య ని — డంబనంబులను

---

1 ఇది 'యాత్రా' శబ్దభవము 'శక్తి యుత్సవము' అను నర్థమున ప్రధానముగ రూఢి గాంచియున్నది (చూ శ.ర పుట 312)

2 'నేతితో గలిపి దేవతలకు నివేదించిన అన్నము' 'దేవతాప్రసాద'మని తాత్పర్యము

3 ఇచట 'యన్యోన్య నిలంబనంబులను' అని యుండదగును 'గృహీతాన్యోన్య హస్తాబ్జలై' అను పోతన ప్రయోగ మిందుల కాధారము (చూ ఆంధ్రమహాభాగవతము Xవ స్కం, 813 ప)

రథసంబుచే పోన — రజ గ్రక్కదం
గుఘటుం గుభుల్లన — క'రి యుంకుచును
పరతరిగొండ ని — వాసుడై కృష్ణ
గిరివాసుడగు బాల — కృష్ణుని హించు
పాటలు బాడుచు — వరగ నొంగారులు
మాటలాడుచును స — ఖ్ఖల నిట్ట్లు లనిరి

## జలక్రీడలు

### దర్వు (ధ్రువం), ఆదితాళం

చేడెలంద రీడ జల — క్రీడ లాడరే ! ॥పల్లవి॥
కృష్ణ, డాయాలు నీడకు వచ్చి — చూడ గాడరే !
॥ చేడెలంద రీడ ॥ ఉ ॥

పొలతులార ! యాచెంగల్వ — పూలు గోయరే !
యిందు, కులుకూచు నాడ తుమ్మెద — సుమ్ము దోలరే !
॥చేడెలంద రీడ॥ 1

కమలనాళముల మెల్ల — గ గ్రహించరే !
పెద్ద, కమలమూలు గోసి కోసి — గట్టు నుంచరే ! [1]
॥చేడెలంద రీడ ॥ 2

నల్లకలువా లందు గోసి — నాకందియ్యరే !
ఎల్ల, తెల్లకలువాలన్ని ఎట్ట్వ — తీసి యొసగరే !
॥చేడెలంద రీడ॥ 3

దురుపాగ తరంగములు — ద్రయియున్నారే !
మి రు, పెరువ కొక్క రొక్కరీన — విడువకుండరే !
॥చేడెలంద రీడ॥ 4

యిపుడు కృష్ణ డిటకు వచ్చె — యెట్ల వుండునే ?
మన, తమములన్ని వరుసగా ని — ధరను బండునే !
॥చేడెలంద రీడ॥ 5

---

'గట్టున+ఉంచరే !' అని విభజనము,

పట్టుగ మన నితం — బముం బెరికె నుండు
నట్టి సైకతములం — దాడుదామా ? 9
లలరాగ మనపాద — ములవెంట నిచ్చోట
కులికె కమఠములను — గొట్టుదామా ? 10
రంగుగ [పొం]గు త — రంగమాలికలపై
నొంగి వుయ్యాల లూగు — చుండుదామా ? 11
సమ్మతిగా నరి — లమ్మ నొండొరులపై
చిమ్మన గ్రోవుల — జిమ్ముదామా ? 12
పోడిమి యాలలు — బాడుచు జోడుగా
వేడుకగా నీదు — లాడుదామా ? 13
ఉల్లాసమలర యా — చల్లని జలమెత్తి
చిల్లిపొల్లుగ[1] నెగ — జల్లుదామా ? 14
దిట్టముగ నీ — నది నీరు పై కుట్టు
నట్టుగ సేతువ — గట్టుదామా ? 15
శేషాద్రి పతియైన — శ్రీ తరిగొండ నృ
సింహాని కృష్ణుని — జేరుదామా ? 16

ద్విపద అనుచు నొండొరులు గో — పాంగనామణులు
గొనకొని చిమ్మన — గ్రోవుల నిండ
సలిలంబు నించి యా — శ్చర్యంబుగాను
చెలగి యొండొరులపై — జిమ్మి నవ్వుచును
శ్రీకృష్ణు బాడుచు — చెలరేగి మురిసి
ఏకతో విహరించు — నేళ కృష్ణుండు
వారిజనేత్రలు — వారి వేడుకే
వారి మధ్యమున ని — ర్వాణులై యున్న
సరణి భావించి య — చ్చటికే[2], వారు
చరియించు టీక్షించి — సరితరి[3] యనుచు

---

1 'సంక్షోభమగునట్లుగా' అని యర్థము (చూ శ ర పుట 270)
2 'యచ్చటి కేగి' అని యుండిన యతిమైత్రి కుదురును
3 సరియైన సమయము.

చలికాంత్ర కనుఁగప్ప — ఒడ్డి యుండందు
నిలిపి, తానొక్కఁడే — నిపుణత మెరయు
సుదతు లెక్కడ తను — జూతురో ? యనుచు
పొదలమాటున డాగి — పొంచి లో నగుచు
సల్లలితాత్ము డీ — శ్వరుఁడునై యుండి
మెల్లన నడచుచు — మేను వంచుచును
బాలుని భంగి న — పద్మలోచనల
చేలంబులెల్ల క్రమము — చ్చిరి కొనిపోయి
తరిగొండహరి పొన్న — తరువుపై నెక్కి
తరుణుల చిహ్నముల్ — తగ జూచుచుండె

ఇట్లు గోపకాంతలు జలక్రీడలాచరించి, కట్టు పుట్టంబులు గానక చలిచేత వణంకుచు తమలో దా మిట్లనుచున్నారు

## చీరలు వెదకుట

### దర్వు, అటతాళం

మనచీర లెవే వోయమ్మా ?
అమ్మా ! యీమాయ యేమే వోయమ్మా ? 1

యింకెట్ల జేతా మోయమ్మా ?
అమ్మా ! యిందెవ్వరుండి రోయమ్మా ? 2

యిందే వుంటి మోయమ్మా !
అమ్మా ! యెవరెత్తుకపోయి రోయమ్మా ! 3

సుడిగాలి రాలే దోయమ్మా !
అమ్మా ! చుట్టుకపోలే దోయమ్మా ! 4

ముచ్చు లెత్తినా రోయమ్మా !
అమ్మా ! యీపూల జాడా డోయమ్మా ! 5

ఆ దిక్కు వెదకూ డోయమ్మా !
అమ్మా ! యీదిక్కు జూడూ డోయమ్మా ! 6

జాడలు ఒట్టా డోయమ్మా!
అమ్మా! యేడ జాడా లే దోయమ్మా!

చోరు లిందున్నా రోయమ్మా!
అమ్మా! సోదించిచూడా డోయమ్మా!

తరిగొండహరికి వోయమ్మా!
అమ్మా! తక్కక మ్రొక్కు పోందమ్మా!

ద్విపద అని గోపికలు చీర — లందందు వెదకి
కనలేక భీతిచే — కళవళంబంది
తక్కక తమలోను — తా మిట్టులనిరి
ఎక్కడ పోయె నె — డీ చీరలన్ని ?
నాచీర యొట్టిద — న్నను విచిత్రముగ
వ్రాసిన బంగరు — పువ్వుల చీర
నెలతరో నాచీర, — నీదెట్టి ? దనన
తెలుకుల నొప్పు [ర—క్త]పు పన్నె చీర
కమలాక్షి! నాచీర — కరకంచు చీర
రమణి నాచీర వా — ర బవంతు చీర
సఖియరో! నాచీర — సరిగెంచు[1] చీర
ఒకవాణి! నాచీర — పెనుబాల చీర
ఎంనాగ! నాచీర — యెఱ్ఱని చీర
నలువొప్ప నాచీర — నల్లని చీర
లలన! నాచీర తె — ల్లని [చాయ] చీర
కలకంఠి నాచీర — ఘనపట్టుచీర
అని తమతమ చీర — లట్టిట్టి వనుచు
నొనరగా నిరీతి — నొక్కొక్కరికి
చెప్పుచు నోములు — చిన్నవోసికొని
తప్పక తరిగొండ — ధామ! నీవైన

---

1 'సరిగె+అంచు' అని విభజనము

మాపాలిటికి వచ్చి — మాచిరలన్ని
జూపవే! మానముల్ — [చూర] బోనియక'

వ ఇట్లు హరికిమ్రొక్కి, మరిన్ని ఇట్లనుచున్నారు

సీ ఈరీతి వెరపగానెం? యిచ్చోటనే
చోరుం వెదకరే సుదతులార!
పూరుషుడైనట్టి చోరుని ఎట్టిలే
సిగ్గులు దక్కునా చెలియలార?
కోకలన్నియు సేగికొని దిగంబ[రలమై]
యిక నెందు బోదమో యింతులార?
ఇండ్లలో నుండువా రీరీతి దెలిసితే
చీరలు దెత్తురె చేడెలార!

గీ వారి కిది యెట్లదెలుసునే వనితలార?
తెలిసితే తిట్టుకుందురా తెరవలార!
నోంపోయితి మికనెట్ల ముదితలార?
ఇంత బయ మెన్నడెరుగమో కాంతలార!

వ అని స్వామి నుద్దేశించి యిట్లనుచున్నారు

## దర్వు, కాంభోది(జి?) రాగం, ఆది తాళం

మాతప్పు నున్నించి — మానము గావవే దైవరాయా!
నీకు, జాతర జేసేము — సద్భక్తితో నేము దైవరాయా! 1
యిచ్చోటికి పురుషు — [లవరు రాక] మున్నె దైవరాయా!
నీవు, వెచ్చెర వచ్చి మా — చీరలు జూపవే దైవరాయా! 2
వరతరిగొండని — వాస! నీ పుణ్యము దైవరాయా!
వరగ కొన్నాళ్లింక — బ్రతికేట్ల[1] జూడవే దైవరాయా! 3

---

1. 'బ్రతికే+అట్ల' అని విభజనము.

ద్విపద అని యిట్లు తరిగొండ — హరిని ప్రార్థించి
[తను]వులు గంపింప — తనుకించి, యొకరు
ఒక్కరి నీక్షించి[1] — యో యక్కలార !
ఎక్కడ బోయె నే — డీ యంబరములు ?
సుడిగాలి వచ్చి దా — చుట్టి వే చనెనా ?
జరియక మ్రుచ్చు లి — చ్చట డాగియుండి
కొనిపోయిరో గాక — కోమలులార ?
మనమెంగు [కి] చటి కి — మ్మాదిక్క వచ్చితిమి ?
వచ్చినవార మా — వసనముల్ విడిచి
యచ్చట బెట్టి భ — యంబేమి లేక
నిప్పట ఎటిరో — నేల తెచ్చితిమి ?
చొచ్చినవార మ — చ్చోటి చేలములు
ఎప్పుట బోయిన — దెరుగ కందరము
ముచ్చట లాడుచు — మోసపోయితిమి
ఇప్పుట కెవరైన — నేతెంచి మనల
నచ్చికలో జూడ — మనకేది తెరువు ?
మందబుద్ధులు బుట్టె — మన కందరికిని
ముందర గతి యెట్లు — ముద్దియలార ?
యనుచు నొందొరులు న — య్యాక్రాంతలగుచు
తనువులు గంపింప — తమ సమీపమున
చేలముల్ గొని పొన్న — చెట్టెక్కియున్న
బాలకృష్ణుని జూచి — బాగాయె ననుచు
పొలతులు మొగమొగం — బులు జూచికొనుచు
తలకొని తరిగొండ — ధాముని మాయ
కనరాదనుచు చాల — కళవళంబంది
గునిసి[2] కొందరితోను — కొంద రిట్లనిరి

---

1. 'గోపికలు పరస్పరము వీక్షించి' అని భావము
2. 'గొణిగి' అని యర్థము (చూ ఆం క్రి స్వ మ దీపిక పుట 374)

## మ్రానిపై కృష్ణుడు - కొలనిలో గోపికలు

### దర్వు, ఆది తాళం

ఎదిగెనే మ్రానిపైన కృష్ణు డమ్మా!
నేడెంతవాడు? కుదురుగా గూర్చున్నా డోయమ్మా!

యేరుంగ ఎదు వచ్చెనమ్మా?
చూడకపోతె, మీదనే వుండిపోయెగదరమ్మా!

వీడు చోరవిద్యవాడే నమ్మా!
లేకుంటె వచ్చె, జాడ గానిపించదటరమ్మా?

వేడుకొని చీర లడుగరమ్మా!
కృష్ణుని నోరు, చూడ సిగ్గయ్యెని గదరమ్మా!

సిగ్గు పోనేపోయె గదరమ్మా!
తరిగొండ నార, సింహుని భజన జేయరమ్మా!

క. అని కాంతలు లజ్జింపుచు
గొనకొని నదిలోని కరిగి కుత్తుకదనుకన్
తనువులు దాపుచు, కృష్ణుని
కనుగొని మ్రొక్కిరి చాల కళవళ పడుచున్

## ప్రార్థన

శ్లో॥ సూర్యాది గ్రహ తారకాంతరగతం సూక్ష్మాదిసూక్ష్మం, జగ
త్కార్యాకార్య వివేచనం మునినుతం కారుణ్యసద్వారిధిం।
తుర్యాతీతసమాధిపూర్ణ మచలం దూరీకృతాఘం, మహ
శ్చైర్యం శ్రీతరిగొండ శేషకుధరాధ్యక్షం భజేఽహం సదా॥

ద్విపద ఓముద్దుగోపాల! — యో శర్మచేల!
ఓమన్మథాకార! — యో మేరుధీర!
తోయజేక్షణ! — నీవు — దొంగవై వచ్చి
మా యంబరంబు లే — మరిన, మ్రుచ్చిలుచు

గ్రక్కున చెట్టెక్కి — కదల కిచ్చోట
చొక్కము మ్మెరిలి — జూచుచున్నావు
ఏనినుంచు జేరి - మర్యాద విడిచి
మానముల్ జాతురే — మగవార లిట్లు?
మునవర్లు! నీకు గా — గా వెట్లు, వింత
పని జెల్ల దెవరికి — పరికించి చూడ,
కోరి మా [సిగ్గులు] — గొంటి వింకేల?
చీరలనైన మా — చ్చికతోడ నొసగు
మని తరిగొండేశు — నహిశైలపతిని
మొనసి ప్రార్థింప, ని — మ్మగ కృష్ణు డనియె

## ఏలలు*

యీ రీతినీ చోరుడాని — దూరుచున్నా రంతెగాని
చీరాలు నే నెరుగాను పోరే! వో కొమ్మాలారా!
— చిడిముడిపాటు లాడకూరే! 1

చీరా లెత్తూ కాపోయినా — చోరూడావూ నీవేగానా
చీరాలన్ని మా కందియ్యారా! వో ముద్దూకృష్ణా!
చేరి నిన్నూ సేవించేమూరా! 2

మీ చీరాలు గాలివాత — మింట కెగిరీ పోవుచుంటె
చూచీ తెచ్చి యుందుంచినానే! వో కొమ్మాలారా!
— లేచీవచ్చి గైకోని పోరె! 3

తగ్గి తగ్గి నీట లోనూ — తనువూలూ దాచీనా మేమూ
సిగ్గూ లేకా వచ్చేదెట్లూరా? వో ముద్దూకృష్ణా!
— చీరలూ దెచ్చి మా కియ్యారా! 4

తరిగొండా నారాసింహుడూ — దండించీనీ మిమ్మిప్పూడూ
సరగునా లేచిచటికి రారే! వో కొమ్మాలారా!
త్వరగా చీరాలూ గట్టూకోరే! 5

---

* ఈ యేలలు మొదలుకొని, చెట్టుపై నున్న కృష్ణునకు, నదిలోనున్న గోపికలకు నడచిన సంవాదము విపులముగా వర్ణింపబడినది.

ద్విపద అని పల్కు పని కాంత — యాధ రిట్లనిరి
వనజాక్ష ! మేము ని — ర్వాణులమైన
కననుం లేచి చ — క్కఁగ నిల్వలేక
నలిలజ్జతో తోయ — మందున్న మమ్ము
లేచిరమ్మంటివి — లెస్సాయె నీతి !
ఈచందమున నీవు — ఎన్నటికి నవ్వు
నిగమముల్ దెచ్చుటో ? — నిర్జరుల యోగక
నగము ధరించుటో ? — ధరుణి బ్రోచుటకో
అరనా పై కెత్తుటో ? — దైత్యుని ద్రుంచి
కరుణచే బాలుని — గాచుటో ? ప్రబలి
బలిని బంధించుటో ? — పార్థివేశ్వరుల
దలముల గెల్చుటో ? సద్ధర్మ ధరణి
ఎరగ భూ మేలుటో ? — ఒకశాలి వగుటో ?
కరుణచే మెరయుటో ? — కల్కివి గ్రామముల
జేసు పై ఘనము ? నా — సిగ్గులు బయులు
చేసితి నేనేమొ — సేయుచున్నానుటకు
సరి సరి ! మేల్ మేలు ! — చాల్ చాలు. మాకు
తరిగొండనాథ ! ప — ద్మాంబ ఎంగియా !

(వ అనిన విని శ్రీకృష్ణు డిట్లనుచున్నాడు )

## దర్వు (తావిడి) ఆదితాళం

మీ వస్త్రము లందియ్యను[1] — మీకు కూలివాడగాను
కావలసితేను వచ్చి — గైకొనిపోరే ! 1

అక్కట ! దిగంబరల — మగుచు ఎందుండి నీ ద్రోల
నక్కడికి తేచిరారే — నంబుజేక్షణా ! 2

నెమ్మి నేను చూడలేదు — మీకు నా కిదేటివాదు
కొమ్మలారా ! చీరలు గై — కొని కట్టరే ! 3

1 'అందిచ్చుటకు' అని యర్థము

యెగ్గంత[1] తెలియక నీ — వెంత రేచరమ్మనిన
సెగ్గు మమ్ము లేవనిదు — చిన్ని కృష్ణా! 4

వనితలారా! తరిగొండ — వాసుడు మీ సిగ్గులు గై
కొనకముందె మీ చీరలు — కోరి కట్టరే! 5

ద్విపద అని పల్క విని భామ — లా హరి జూచి
కను గ్రేరజేసి త — క్కక నిట్లు లనిరి
సరి సరి, మేల్ మేలు — సరసిరుహాక్ష!
సరగున నీ ముచ్చ — టలు దెలిసె
శరణనుచున్న మా — సంసారములను
వరియింప దలచెద — వౌర! నీ వింక
గుణవిహీనుడవౌట — గురు తెరుంగకనె
గుణశాలివని నమ్మి — కొనియుంటి మకట!
నీకు హేయములేక — నేడు మామాన
ంబు లొస్తిముంయె — కొనకు[2] నీరీతి
మానహీనుడవని — మాకెల్ల దెలిసె
[గాని యుం] తటనైన — గౌరవం బెసగ
మాయంబరంబులు — మాకు దెచ్చిమ్ము
మాయామివై మారు — మనలంద్దనిన
తరిగొండవారి గోప — తరుణు లాడి
యురవైన దయ దాచి — యిట్లని పలికె

## ఏలలు

ఆకాశానా నెగిరిపొయ్యే — కోకాలు నా|కూ దొరి|కేనూ
మాకూ నే నేమిటీ కిచ్చేనే ఓ గొల్ల భామల్లారా!
— రూకాలాకే నమ్మాకానేనే! 1

---

1 'ఎగ్గు + ఇంత' అని విభజనము 'ఎగ్గు కొంచెమైనను' అని యర్థము ఎగ్గు = తప్పు, అవమానము (చూ సూ రా అం నిఘంటువు, ప్రథమ సంపుటము పుటలు 766,767)

2 'చివరకు' అని యర్థము

రాజాసామూతో నీవూ చీ – రా లమ్మేసంటెనూ మేమూ
రాజాతో జెప్పికాపోమూరా! వో ముద్దూ కృష్ణా!
— రవ్వలేలా? చీరా లియ్యారా! 2

రాజాతో [జెప్పి] నూ మీ – రారంభించియున్నా రత్తైతె
రాజెవ్వాడో నాకూ జూపారే? వో కొమ్మాలారా!
— రాజుకడకూ పోదామూ రారే! 3

రాజూకడకూ బిరబిత్తారే – రమ్మానె వత్తైతే మేలే!
వ జాగా, దీ మాటా లనకూరా! వో ముద్దూ కృష్ణా!
— వచ్చి మా చీరా లం[దియ్యా]రా! 4

మీకెందూ రాజన్నాడాని – ేకగా నంటరీ వూనీ?
నాకూ మీరాజూనూ జూపారే! వో కొమ్మాలారా!
— నాటికి మీ చీరా లిచ్చేనే! 5

శ్రీ తారీగొండా మా నారా – సింహా! మాకూ రాజావీవే!
ఖ్యాతిగా నన్యాలూ తే[రూర!] వో ముద్దూ కృష్ణా!
— కావున మా చీరా లియ్యార! 6

ద్విపద అన విని శ్రీకృష్ణు – డతివల జూచి
కనుగీటి పలికె నో – కామినులార!
ఎవని వీక్షించి మో – హించితి రిచట?
ఎవడు మీ హృదయంబు – లెల్ల హరించె?
మరువ కే పురుషుని – మగనిగా దలచి
మురియుచున్నారు? మీ – ముచ్చట లెల్ల
తెలుపు డన్యుడగాను – తెలియ బాధ్యుడను
తలపులు మీరేల – దాచెదరింక?
మొనసి చల్లకు వచ్చి – మూంత దాచినను

1 'బంధువు' అని యర్థము 'బాధ్యుడు, బాధ్యము' అను పదములు సన్నిహిత బాంధవ్యమును దెలుపునవిగా చిత్తూరు మండలమున నేటికిని వ్యవహారములో నున్నవి

ఎని యౌనె? చెల్ప, యం — బరవు రాసీద
[నడిగి]తే లేదన — నటవెూర నేను
నడిగిన ఎచ్చెద — మని ఏూటచేసి[1]
ఎచ్చి కైకొనుడు మీ — వసనంబులన్ని
యిచ్చెద, నీటలో — నిటు నానవలదు
చలిచేత వాతంబు — సంభవించీని
కలకంఠులార! శ్రీ — క్రుమె రారె! యనుచు
పలికిన తరిగొండ — పతిని వీక్షించి
ఎలిరాకు బోణు లం — దరు నిట్టు లనిరి

## దరు, ఆట తాళం

చీరాలు కట్టక — నె రీతి ఎత్తుము బాలకృష్ణా?
మీ రీ, వారి వెడలివచ్చి — చీరలు గట్టరె చెలియలారా! 1
చేరవచ్చేము ఏూ — చీరలు ఇుస్వీర! బాలకృష్ణా!
నన్ను, చేరితేగాని మీ — చీరలియ్యను పోరె! కొమ్మలారా! 2
తరిగొండవా! యెం — తటి ఎర్తయుఁడవుర! బాలకృష్ణా!
నన్ను, దురుసుగ మీరింత — దూరితే నెరతునా కొమ్మలారా? 3

[వ అని పల్కినను విని గోపకాంత కిట్లనుచున్నారు]

గీ అయ్యయో! నీట దేహంబు లదరసాగె
నేమిసేతుమురా కృష్ణ? ఘుంటే కంక
నూరి ఏగవారు రాకము న్నె రయముగ
తెచ్చి మాచీర లీర! సందేహమేల?

ద్విపద, అని విని శ్రీకృష్ణ — డతివల జూచి
తనలోన నగుచు న — త్తరి నిట్టు లనియె
ఎనితలారా! ఏూగి — నారెవ్వరైన
మొనసి వచ్చిన సిగ్గు — మోసమౌ ననుచు
దిగులు నొందెదరైతె — తెలిసి చూచినను

---

1 'వాగ్దానము చేసి' అని యర్థము

మగువనే నేనైతి ? — మగవాడగానె ?
మీదగ్గరికి వచ్చి — మీకు నన్ చీర
రాదరంబుగ నియ్య — మనుటకు మీకు
సిగ్గులేకను, నన్ను — చెరవచ్చుటకు
సిగ్గంటి రటుగాన — చీర లెత్తికొని
మీకూరివాడనై — మీకిచ్చు పనిక
నాకు సిగ్గయ్యె [ని — నా] తల్లిదండ్రి
యిది ఎన్ను బెట్టదు — రింక మీతోను
మదవతులార ! నే — మాట్లాడ వెరతు
మీ చీర లిచటికి — మీ మగల్ వచ్చి
మీ చేతులందుంచ — మీ సిగ్గు గాన
వలె, నిందు పర మగ — వడనై నేను
చెలగి మీ చీర ల — చ్చిన సిగ్గు చేడె !
కొంటెలై ఎడచి
జంటగా నుర లి — చ్చట నుండు నేళ
నొంటిగా నిచట నే — నుంటినేని
కంటు దొచును మీ మ — గండ్ల కందరికి
కావున నాతోడు — గా మీ మగండ్లు
వావిరి నిచటికి — వచ్చిన, నాకు
భయము దిరు నటంచు — పలికి, వేణువును
రయ[ము ం మధు]రాగ — రంబున నుంచి
తగ నూది తరిగొండ — ధాము డా చెలుల
మగలను బిలిచె ను — మ్మలి నిట్టు లనుచు

## ఏలలు

కియ్యో ! యూని ఎనుూ నెల్లా — గెంటా కీ దిక్కా మళ్ళించి
చెయ్యానా నిందూ రండోండ్లాలా ! వో గొండ్లాలా !
— సరవిసీ జాడుడి [పెండ్లాలా]

బిరబల్లా౯ జంపుగాసా — చారబాడీయున్న రీడాబా
సరగానా సందూ రండాండ్లాలా ! నా గౌండ్లాలా !
    — చక్కగా ఆడుడీ పెండ్లాలా 2

తరిగొండా నారాహరి నీా — అరుణాలా సిగ్గా తిచ్చేటు
చెరనకాముందే రండాండ్లాలా ! నా గాం[డ్లాలా !]
    — చేపట్టి యెలుడీ పెండ్లాలా 3

ద్విపద. ఓ లిమ్మిగౌడ ! యో — హో బొమ్మిగౌడ !
ఓ లచ్చిగౌడ ! యో — హో కన్నిగౌడ !
ఓ చిక్కగౌడ ! యో — హో చుక్కగౌడ !
ఓ చిరగౌడ ! యో — హో కురగౌడ !
ఓ బాలగౌడ ! యో — హో బుచ్చిగౌడ !
ఓ [బయ్య] గౌడ ! యో — హో కియ్యగౌడ !
ఓ కోనగౌడ ! యో — హో యెరగౌడ !
ఓ కానగౌడ ! యో — హో కంటగౌడ !
ఒండురం డోహో హా ! — రాండ్రో ! యిటంచు
దండగా ధ్వనిజసి — తరిగొండ నృహరి
పిలిచిన వెరచి ఆ — టంబోన్ను తెల్ల
వె[లవె] లబొవ్వు — నేక నిట్లనెరి

## దర్వు. (ధ్రువం). ఆదితాళం

పిలువావద్దురా ! మా ఎదుల పిలువావద్దురా ! ॥పల్లవి॥
వారీ ! చెలువాకృష్ణా ![1] వారిందు ఎచ్చితె మమ్ము కొట్టే రయ్యో !
॥పిలువావద్దురా !॥ ॥2॥

గుట్టుగా సివిందు ఎచ్చి — కోక లియ్యమంటె, గట్టి
రట్టువెట్టె మా మగల — రమ్మాని పిత్తే పియ్యయ్యో !
॥పిలువావద్దురా !॥ 1

1 'చెలువను (అందము)గల కృష్ణా !' అని యర్థము ఈ ప్రయోగము 'కలికి కృష్ణుడు' వంటిది చూ పుట 6.

యీ రథసామెల్ల నారి — వారందారూ విన పరుపు
బరి పచ్చితే వేమెట్ల — బ్రతుకుదు ? మయ్యయ్యో ! యింకా
॥పిలువావద్దురా ॥ 2

నవ్వుగదు తారిగొండా — [నర] హరితోడే ! మమ్మిందు
రవ్వ జేయువద్దు ! మా చీ — రా లిచ్చి సిగ్గు నిల్పరా !
॥పిలువావద్దురా ॥ 3

(ఏ లనిన గోపికలతో కృష్ణుం డిట్లనుచున్నాడు )

## ఏలలు

మగలాను నే బిల్చేనాని — వగుల నొందేరె తె గాని
నే గట్టిగా పిల్చుట మానేనే ! వో కొమ్మాలారా !
— వేణునాదామైనా జేసేనే ! 1

పొందూగా వెణువూదీనా — యందరు ఎత్తారుగనా
నెందాకా రచ్చవెట్టేవురా ? వో ముద్దూకృష్ణా !
— యింత నిర్దయా నీకేలారా ? 2

యెంతా నే బిల్చినా రాక — పంతాముతో నందె యున్నా
రింతా నెనరూ లేదివే ? వో భామాలారా !
— యేను మీకూ నన్యుడానేమే ? 3

బిరబిత్తాలే రమ్మానూచు — తరుణాలాను చేరా బిలచె
పురుషూ లెందున్నారు తెలుపారా ? వో ముద్దూకృష్ణా !
— ఘూటితి మదిలో దలపారా ! 4

ఎరపిరి చీరాలు విడచి — జలమూలాలో యీదులాడె
తరుణాల మీరెందు గన్నారే ? వో భామాలారా !
— అప్ప చిన్నె లెన్ని యున్నరే ? 5

సమ్మతముగా తారిగొండా — స్వామి ! నిర్వాణముగా నీవూ
మమ్మూ చూడావలె నెమిరా ? వో ముద్దూకృష్ణా !
— మంచి, దైవె వత్తూవేమిరా ? 6

## నిర్వాణులు - గోపాలుడు

ద్విపద అని పల్క యాకాంత — లందరు ధైర్య
[ము]న కృష్ణు నీక్షించి — 'ముద్దుగోపాల!
ఉచ్చుగా నీవంట — యభిమానవారి
రచ్చం బెట్టునే — రమణీమణులను?
ఎమ్మెటు గనుట నీ — మానసంబునకు
నమ్మతమైన న — చ్చటికె వచ్చెదము
లోకాత్మ! నీ యాజ్ఞ — లోనె నిల్చెదము
నాకేల మానవ — మానంబు?' అనుచు
మానినీమణులు వా — మ కరాబ్జములను
మానరక్షణము స — మ్మతిని గావించ
పాలిండ్లు దక్షిణ — పాణిపద్మముల
చాల గప్పుచు జలా — శయముద్ర వెడలి
వచ్చిన వారి ని — ర్వాణ చిహ్నంబు
లచ్చుగ తరిగొండ — హరి జూచి పొన్న
చెట్టుపై నుం [చిన — చీ]రల మూట
దిట్టడై కొని ప్రహా — రిగ యిట్టు లనియె

### దరువు, ఆదితాళం

ఎమ్మతమాయనే ముద్దు — గుమ్మలారా!
నే మీ, సొమ్మునైతినె బంగారు — బొమ్మలారా! 1
మీరు రెండు చేతులెత్తి — ముదితలారా!
నాకు, నెరుపుతో మ్రొక్కవె — [నెలతలారా! 2
తరిగొం]డ వాసుని తోడె — తరుణులారా!
నాకు, చెరగానా చీర లిచ్చేసె — చెలియలారా! 3

వె చిన్నికృష్ణ! రెండు చేతులతో నీకు
మ్రొక్కమన్న నిపుడ మ్రొక్కలేము,
మొనసి యొక్కచేత మ్రొక్కుమనిన, మేము
నీకు మ్రొక్కగలము నీరజాక్ష!

[ఆ వె  చేడెలార! యొక్క] చేత మ్రొక్కిన మ్రొక్కు
లెందు కిపుడు మెచ్చు నీశ్వరుండు?
రెండుచేతు లొక్కరీతిగా పైకెత్తి
విడిచి మ్రొక్కుడిందు నెంతవార!

### జంపె

ఇటువంటి యన్యాయ — మెందైన గలదటరా కృష్ణా?
కటకటా! కృష్ణ! నా — పటము లందియురా! 1

న్యాయంబుగా [నేను] — నపి ంప, మిర ం
న్యాయమిది యని పలుక — నర్థమగునటరే! 2

యిపుడు చెతులను పై — కెత్తుడని పలికేవు
కపచాల్మ! నీకు కని — కరము లెదటరా? 3

కనికరము నామదిని — కలుగగాని[1], నప్పి
మ్మినసి నాకెటులైన — మ్రొక్కుమననానే! 4

తరిగొండవరి! నీకు — తగ మ్రొక్కుతైనాకు
నిరపంద నాదాయ — మేమిరా కృష్ణా? 5

### దరువు, ఆదితాళం, మధ్యకాలం

చ్రికరముగ నా చీరల నిప్పితె — నా కాదాయంబేమే?
మరి, నా కాదాయం బేమె? 1

మా కి చీరల లోకగ నిచ్చిన — నీకూ పుణ్యమురా కృష్ణా!
మరి, నీకూ పుణ్యమురా కృష్ణా! 2

చీరల మా కిచ్చిన నా కాపల — మి రేమిత్తురె భామా?
(మరి, మా రేమిత్తురె భామా?) 3

తరిగొండాధీశ్వర! ని పడిగిన — దిరవుగ నిత్తుమురా కృష్ణా!
మే, మిరవుగ నిత్తుమురా కృష్ణా! 4

---

1 'కలిగినందువలననే' అని యర్థము

## ఏలలు

ఎవరూ మగడూగా దలంచి — యిలలో గౌరిదేవి వ్రతము
సవినయముగా జేయూచున్నారే ? వో భామలారా !
— సత్యముగా నాతో జెప్పారే ! 1

లంతటికీ పరుడై విశ్వ — మంతా రక్షింపుచున్న శ్రీ
కాంతు పొందూ గౌరీనామూరా ! వో ముద్దు కృష్ణా !
— గౌరినోమూ నోమినామూరా ! 2

వ్రతమూ సాంగమూగాకానే — వసనమూలూ విడిచీ, నీటా
హితమూగా జొచ్చితిరందునా వో భామాలారా !
— యీ వ్రతా మింకా ఫలింపూనా ? 3

వెలయూ గౌరి వ్రతమూ జేయూ — ఫలియించే పాట వుపాయూ
మెలమీతో నీ విపుడూ దెలుపారా ! వోముద్దూ కృష్ణా !
— చెలగీ మే మూర్గ జేసేమూరా ! 4

కరమూలూ పైకెత్తి మీరూ — తరిగొండా నరహరికీ
వరుసాగానూ నిండీ మ్రొక్కారే ! వో భామాలారా !
— వారు వ్రతఫలామూ నిచ్చూనే ! 5

ఆ వె మొనసి యొక్కచేత ముందుగా మ్రొక్కెద
మంబరంబు లియ్యి ! మంది కట్టి
యువల రెండు చేతు లమరగా పైకెత్తి
నీకు మ్రొక్కెదముర నీరజాక్ష !

(వ అనిన శ్రీకృష్ణు డిట్లనుచున్నాడు )

ఆ వె ఒక్కచేత మీరు మ్రొక్కిన నే చీర
లియును ! రెండు చేతు లెత్తి మ్రొక్కి
చీరలడుగు డెను చెచ్చెర ,నిచ్చెద
నెంచి మ్రొక్కకున్న నియను పోరె !

వ. లనిన విని గోపకాంతలు తనుతో ధా మిట్లనుచున్నారు

## దరువు. అటతాళం

బాలగోపాలుడు — పద్మాతో నున్నాడు
చేలము తీయ జేసి — సేయుదామే ? 1

తిన్నతిన్నగ బోయి — చిన్ని గోపాలుని
పన్నుగ నిక పొంచి — పట్టుదామే ! 2

పట్టబోయిన వీడు — పటములు గొని మంద
కట్టె బోయిన, వీని — కడ్డమేమే ? 3

కూరిమితో వాని — జేరి, చుట్టును పొంచి
కోరి చీరలు నాచి — కొందామేమే ? 4

తరిగొండ నరహరి — దండసాధ్యుడుగాడు
శరణను టే మంచి — సదుపాయమే ! 5

క అని పల్కిన సుందరులను
కనుగొని దరహాసవదన కలితుండగుచున్
కనకాంబరు డంబరముల
గొనిపోవుచునున్న జూచి గోపిక తె. విన్

వ శ్రీకృష్ణుడు జనుచున్న మార్గంబున కడ్డంబుగా బోయి యిట్లనుచున్నారు.

## దరువు, అటతాళం

గోపాల ! మందకు బోకురా ! సుగుణాకరా !
నీపుణ్యము, మమ్మా
రాపూరవ్వలు సేయవద్దురా ! యేటి పద్దురా ?
మేము బ్రదికే వుపాయ
మీపట్ల నివు చింతించరా ! కరుణించరా !
మాచీర లందిచ్చి
యాపాద వారించి శ్రీవరా ! సిగ్గుగావరా ! 1

[అగ] రా! యిది యేటి సద్దురా? యేమి రద్దురా?
యీ సందడి విని
మగవాండ్లెంకెవరైన వచ్చేరా, మమ్ము జూచేరా
వారు జూచితే మేము
ఇ గతి నెవ్వరి నెట్లు జూతూమూ? యేమి సేతూమూ?
మా కిపు డంటియుండే
దిగులు దీరిచి నీవే ప్రోవరా! సిగ్గు గావరా! 2

యేమూ నేరము జేసినామురా! వెరచెమురా!
కట్టు చీరాలు విడిచీ
మేమూ నీళ్ళలో జొరరాదురా! బుద్ధిలేదురా!
యీ తప్పు మన్నించి
మామీద నీదయ నుంచరా! పరిపాలించరా!
వో తరిగొండనగరా
రామా! మమ్మెట్లైన ప్రోవరా! సిగ్గు గావర! 3

ద్విపద అని భంగిపడెడి[1] గో — పాంగనామణుల
గని హరి దరహా — కలితుడై పలికె
పలిని గోరుచు రతి — పతిని గెల్చుటకు
వ్రతనిష్ఠతోనుండి — వసనముల్ విడిచి
నీటిలో జొత్తురె — నియమంబు లేక?
నేటికి కాత్యాయ — నీ దేవి వరము
కల్ల జేసుటెగాని — కల్గునె ఫలము?
పల్లవాధరలార! — పాణిపద్మముల

---

1 'భంగపడెడి' అని యుండదగును 'బలిమాలుచున్న' అని యర్థము ఈ యర్థమున రాయలసీమయందలి కొన్ని ప్రాంతములలో 'భంగపోవు' అను ప్రయోగము నేటికిని వ్యవహారమున నిలిచియున్నది

నెత్తి మ్రొక్కిరి తైన । — యీ ప్రకారము
నిత్తు, మీచేతను — లిత్తు నటంచు
పలికిన తరిగొండ — పతిని వీక్షించి
సతినాక్షు లందరు — నగి యిట్టు లనిరి

## దరువు, ఆదితాళం

సిగ్గు లె తెరునయినాగాని — చిన్నికృష్ణున
కిచ్చోట, లగ్గి చేతులెత్తి మ్రొక్కు — దామె వేడ్కనా 1
రెండు చేతు లెత్తి మ్రొక్కే — దుండకుంటెమానె
పెద్ద, కొండగవిలో తపమూజేయు -- చుండవచ్చునే ! 2
ధైర్యమూన మ్రొక్కకుంటె — కార్యముగా దింకమీద
నార్యు లిచ్చోటికి వచ్చే — రమ్మా ! జిల్లారే ![2] 3
పదరి చేతు లెత్తబోతె — కదిసిప్పుట్టే సిగ్గుచేత
వదలి, గుండె దదరూచున్న — విదిగో చూడారే ! 4
యేమైనాగాని చేతు — లెత్తి తారిగొండాహరికి
క్షేమముగా మ్రొక్కాకుంటె — సిగ్గు దక్కాదే ! 5

వ అనిన విని మరిన్నికొంద రతివ లిట్లనుచున్నారు

ద్విపద కాంతలార ! యింత — కళవళపడుచు
నెంతసేపుండిన — నీ మాధవునకు
దయబుట్టి మనకు వ — స్త్రంబు లందియడు
రయమున మన మంద — రము నొకమాటు
కనుగవల్ ముకుళించి — కరముల నెత్తి
తనువుల వంచి నం — ద తనూజుమ్రోము
మొనసి చూడక వేగ — మ్రొక్కి కూర్చుంద

1 'మ్రొక్కనచో' అని యర్థము
2 ఇది 'పురే ! బాపురే !' — మొదలగువానివంటి ఆశ్చర్యార్థకమగు అవ్యయము

మని నిశ్చయింపుచు — నాకాంతలెల్ల
వరతరిగొండ నీ — వాసుడా శేష
గిరిధాము నీక్షించి — గెంట కిట్లనిరి

ఆ వె విసర కృష్ణ ! మేము కనుగవల్ ముకుళించి
కాయములను వంచి, కరము లెత్తి
తనర నీకు మ్రొక్కెదము నీవు మాదిక్కు
చూడ కంబరంబు లిడ నుంచు

ద్విపద అని గోపికలు బల్క — నంబుజాక్షుండు
విని, వారియుక్తికి — వెరగునొందుచును
కరము ద్రిప్పుచు శిర — కంపంబుచేసి
పరిహాసముంబుగా — పలికె నిట్లనుచు
నెరజాణవార ! మీ — నిపుణత నేను
నెరుగుదు కొంతైన — నీ మాటలేల ?
చక్కగా లేవి హ — స్తములు పైకెత్తి
మ్రొక్కకుండిన, చేల — ములను మీ కియను
మీ కన్యుడనుగాను — మిత్రుడ గాని
మీకు సంకోచ మే — మిటికి నాచెంత ?
నయము[తో] నే చిన్న — నాటినుండియును
ప్రియుడనై మీతోడ — పెరుగుచున్నాడ
మెరయుచు మీలోనె — మెలగుచున్నాడ
మరి నేను చూడని — మర్మంబు లేవి ?
ఇచ్చట మీకన్య — లెవ్వరు లేరు
ముచ్చటగా నాకు — మ్రొక్కి చేలములు
[ధరియింపుడ]ని పల్క — త[రిగొండ] హరిని
చిరునవ్వుతో నవ్వి — చేడె లిట్లనిరి

## ఏలలు

ఎంతా వేడీనానూ చెతూ — లెత్తీ మ్రొక్కూడాని పలికే
పంతామూ వీడ వింకెట్కారా ? వో ముద్దూకృష్ణా !
— బ్రతుకూ బయిలుజేసేవేమిరా ?

తక్కాకా కరాము లెత్తి — మ్రొక్కామంటె నన్నూ మీరు
చిక్కా[లు బె] ట్టాదున్నారే! వో కొమ్మాలారా!
— తక్కూ లెప్ప నేర్చుకున్నారె! 2

తరింగొండవాసా! నీ కిది — ధర్మామూగా దోఁచియుంటె
కరమూ లెత్తి మ్రొక్కేములేరా! వో ముద్దూకృష్ణా!
— నరకూనా మా చీరా లియ్యారా! 3

## ఆత్మ నివేదనము

ద్విపద అని గోపభామిను — లందరు ధైర్య
మున కృష్ణదేవుని — ముందర నిలిచి
తొలఁగక రెండు చే — తులు ముకుళించి
నలువొప్పగా 'నమో — నలినాక్ష!' యనుచు
'తరిగొండపురవాస! — దండశూకాద్రి
వర! విశ్వరూప! స — ర్వజ్ఞ! గోవింద!
పురుషోత్తమా!నంత — పుణ్య! తపంబు
లెరుగము మమ్ము నీ — వేరీతినైన
రక్షించు' మనుచును — రాకేందువదన
లకిఁ ఙ భక్తితో — నప్పు డిట్లనిరి

శ్లో॥ ఆధారాది పయోరుహోపరి సహస్రారాబ్జ మధ్యస్థితం
బోధానందఘనం వికారరహితం పూర్ణానుభావోజ్జ్వలం।
రాధాలోచనకైరవామృతకరం రాజీవపత్రేక్షణం
స్వాధారం తరిగొండశేషకుధరాధ్యక్షం భజేఽహం సదా॥

## చూర్ణిక

శ్రీమదఖండ బోధప్రద సకల నిగమ నిగమాంత శాస్త్ర పురాణేతిహాస
ప్రతిపాద్య సచ్చిదానంద నిత్య పరిపూర్ణ దివ్య మంగళ విగ్రహం,
కమలా పరిగ్రహం 1

ఉరుతర పాఠీన కమఠ వరాహ నరకంఠీరవ వటుక పరశుధర కోదండ
ధరణ సీరహస్త బుద్ధ కల్కి ప్రముఖ వివిధావతారం, సుజనమందారం 2
సనక సనందన సనత్కుమార సనత్సుజాతాభిధాన ప[రమ][1] యోగీంద్ర
కోపోదిత శాప సంజాత హిరణ్యాక్ష హిరణ్యకశిపు దశకంఠ కుంభకర్ణ
శిశుపాల దంతవక్త్ర భీకర గర్వాంధకార ప్రభాకరం, బృందారక జన
శ్రీకరం 3
కమలగర్భ రుద్ర కశ్యప వశిష్ఠ శక్తి పరాశర వ్యాస శుక శౌనక గౌతమాంగీర
సాత్రి భరద్వాజ నా[రద శ్రీవత్స][2] కౌత్స భృగు జమదగ్ని వాలఖిల్య
వాల్మీకి విశ్వామిత్ర ముఖ్య మునిబృంద వందిత చరణారవిందం, జగ
న్మోలపెందం 4
సహస్ర మార్తాండ ప్రభా భాసమాన నానామణిగణఖచిత నూపుర కింకిణీ
మేఖలాంగద కంకణ హస్త [శ్రీ గ్రైవేయ][4] హార కుండల మకుట దివ్య
కనకాంబరాలంకృతం, దూరీకృత ప్రాకృతం 5
శంఖ చక్ర గదా ముసల కౌక్షేయక ధను ర్బాణ ముద్గర భిండివాల పరశు
పట్టిస పరిఘాద్యనేక దివ్యాయుధధరం, శత్రుజనవారణ మ[హీధరం][5] 6
మగధ మాళవ మలయాళ చోళ నేపాళ కొంకణ ద్రవిడ తెంకణ
సాళ్వ సౌరాష్ట్ర సౌవీర కురు కుకురు కోసల పుళింద లాట విరాట
ఘోట కర్ణాట కాంభోజ కాశ్మీరాది సకల దేశాధీశ్వరాధీన సమస్త విత్తాప
హరణం, స[ధు సంపత్కారణం][6] 7
నిరంతర కిసలయ పత్ర కోరక కుసుమ ఫల మిళిత విలసన్మహీజాత
పరివృత శేషశైలాగ్ర శాతకుంభకలశోన్నత గోపుర ప్రాకార మంటపాలయ
ద్వార కవాటశోభితానందనిలయ నివేశం, శ్రీవేంకటేశం 8
[నిరుపమ నిరుపాధిక ని][6]రాలంబ నిష్కళంక నిరామయ నిర్వికారాది
మధ్యాంతరహిత స్వయంప్రకాశం, తరిగొండ పట్టణాధీశం భజేఽహం,
భజేఽహం, భజేఽహం 9

అని మరి ప్రస్తుతించుచున్నారు

1, 2, 3, 4, 5, 6– ఈ శిథిల భాగములు 'విష్ణుపారిజాత' మందలి యిదే చూర్ణిక ననుసరించి పూరింపబడినవి

## దరువు

దండమూ కృష్ణా । దండ [మూ] ॥పల్లవి॥

[అండజవాహన । ]
కుండలిశయన । బ్ర — హ్మాండశరీరా । ॥దండమూ॥ 1

మందరగిరిధర । — సుందర విగ్రహ ।
నందతనయ । గో — వింద । ముకుందా । ॥దండమూ॥ 2

గురుతరవేంకట — గిరివరనాయక ।
తరిగొండాధీ — శ్వర । నరసింహ । ॥దండమూ॥ 3

## వస్త్రదానము

గీ అనుచు మ్రొ[క్కుచు బలికిన, నంబుజా]క్షు
డిట్టులని పల్కె మీచీర లెట్టి ? విపుడు
దెలుపరే । యన విని గొల్ల తెరవ లెల్ల
బాలకృష్ణుని వీక్షించి పలికి రిట్లు

## దరువు, ఆనందభైరవిరాగం, ఆదితాళం

నా చీర యెట్టిదన్నను — నందనందన వినరా ।
పూచీరట్లుండు లా చీరరా । 1

నెలవుగా నాచీర మరి — నీ వెట్టిదనిన విను
కళలచే నొప్పు చందురు — గావి చీరరా । 2

శ్రీలలనాధీశ । నాదు — చీర యెట్టిదంటె విను
మేలు కమ్మిన మరు పెను — బాలా చీరరా ।[1] 3

చిన్నికృష్ణ । నే గట్టిన — చీ[ర యెట్టిదంటె] విను
పన్నుగా మెరసే లింగాల[2] — పట్టుచీరరా । 4

1 'పెనుబాల (పెనువాలపేట ?) అను ఊరిలో తయారు చేయబడిన మేలు కమ్మిచీర' అని యర్థము 'మేలుకమ్మిచీర' యనగా అంచు మూడంగుళముల వెడల్పు ఉండునటుల చాయనూలితో నేసిన పెద్దంచులు గల కోక (చూ శ ర పుట 643)

2 'లింగాల' — అనునది చీరల నేతకు ప్రసిద్ధి గాంచిన ఒకానొక గ్రామం పేరు కావచ్చు

వేణుగానలోల ! నీవు — విను నా చీర యెట్టిదంటె
నాణెమైన యెఱ్ఱని బా — ణాల[1] చీరరా ! 5

బాలకృష్ణ ! నా చీర యే — పాటి చీరంటేను వినుము
లాలితమైనట్టి కలిక చీరరా ! 6

కలికికృష్ణ ! నా చీర యి — ఘనమైన చీరంటవైన
బలు మేలైనా కంబావతి — పట్టు చీరరా ![2] 7

నీరజాక్ష ! నే గట్టిన — చీర యే చీరంటివైనా
కోరి కొన్నట్టి ప్రాప — ళ్ళాల చీరరా ![3] 8

లనుచు తమతమ చీర లట్టిట్టివని [గోపిక] లందరు వినిపింప, నవ్వి తరిగొండ
విభు డిట్లనెను

వె గోపకాంతలార ! కోక లిచ్చెదనాని,
నాయెదుటను మీరు నగుచు నిలిచి
మీరు కట్టికొనుడు మీయాంబరంబులు
మరుగు కేగవలదు మగువలార !]

అనిన విని గోపకాంత లిట్లనిరి కృష్ణ !
యిలను మానవమానంబులెల్ల నీకు
ప్రీతి రెట్టింపగా సమర్పించి మరల
మ్రొక్కెదము వల్వ లీయ్యరా మోహనాంగ !

---

'బాణాల' (బాడాల ? లేదా బాణావరం) — ఇదికూడ చీరల నేతకు పేరుపడిన గ్రామ నామం కావచ్చు

మడుగు వస్త్రముగా నుపయోగించుటకై ప్రత్యేకముగా తయారు చేయబడిన ఎఱ్ఱని పట్టు దోవతిని 'కంభావతి' యందురు ఆటువంటి పట్టుతో నేసిన చీరయే 'కంభావతి పట్టుచీర'

ప్రాపంచికముగా వేదములు నాలుగు వేదములకు నాలుగు వర్ణములు పురాణ ప్రసిద్ధములు అందు ఋగ్వేదము పసుపు యజుర్వేదము తెలుపు సామవేదము ఎరుపు అథర్వణ వేదము నలుపు ఈ నాలుగు రంగుల తంతులతో ప్రత్యేకముగా నేయబడిన చీరకు 'ప్రాపళ్ళాల చీర' యను వ్యవహార ముండి యుండవచ్చును

అని మ్రొక్కిన గోపికలను
వనజాక్షుడు మెచ్చి మెచ్చి వసనము లొసగన్
ఘన
[కొని] తమవస్త్రములు గట్టికొనిరి ముదమునన్

వ అప్పుడా శౌరి గోపకాంతల జూచి యిట్లనుచున్నాడు -

## వ్రతఫలము

ఉ సతులారా! వరగౌరిదేవివ్రతమున్ సంకల్పపూర్వంబుగా
పతి గామించుచు జేసినారు, భళి! మేల్, బాగాను మీ కోర్కెలన్
వ్రతము[న్ పాంగముగా ముగి]ంచి, యట సర్వస్వంబు నారాయణా
ర్పితమంచున్ వచియించుడా ఫలము నిప్పించులన్ విశేషంబుగా

వ అనిన విని గోపకాంతలు పద్మాసనాసీన[లై కూర్చుండి] గౌరికి షోడశోపచార
పూజలు సమర్పించి, వ్రతోద్యాపనంబు[జేసి, గౌరిదేవిని] మరి నుద్దేశించి
యిట్లనుచున్నారు

శా గౌరీ! పార్వతి! చంద్రమౌళితరుణీ! కల్యాణసంధాయినీ!
సారాసారవిచారిణీ! శుభగుణీ! సానందవిద్రూపిణీ!
కారుణ్యామృతవీక్షణీ! భగవతీ! కంకాళినీ! భైరవీ!
శౌరే మమ్ము వరించు సర్వరము ని[ప్పింపవే క్షవన్ బూనవే!]

వ అని ప్రార్థించి, ఆరాత్రికంబుగైకొని మంగళంబు పాడే విధం బెట్టులనిన

### దరువు (తోడి), ఆదితాళం

శైలజాతాకూ గౌరికి — జయమంగళం ॥ప ల్లవి॥
శ్రీ, శూలధరునా కభవూనాకు — శుభమంగళం ॥శైలజాతాకూ॥ ॥పల్లవి॥
మహిషాసుర సంహారిణికి — మౌనిజనోద్ధారిణికి
బహుచరా వరమాతకు — భవ్యమంగళం శ్రీ ॥శైల॥ 1
సుగుణాభరణధారిణికి — సురసమూహోద్ధారిణికి
నిగమాంతసంచారిణికి — నిత్యమంగళం శ్రీ ॥శై॥ 2

తరిగొండ నరహరి సో — దరికి, శ్రీకంకాళినికి[1]
సురుచిర సువాసినికి — శుభమంగళం శ్రీ॥శో॥ 3

అని గోపికలు మంగళంబు బాడి, గౌరీవ్రతంబు సంపూర్ణంబు గావించి, హరిని జూచి యిట్లనుచున్నారు

## ఏలలు

గౌరీవ్రతమూ — సాంగామైన వెనకా, వ్రాతఫలము
నిచ్చేనంటి వియ్యారా! వో భాలాకృష్ణా!
— పలికి మాతో బొంకావలదూరా! 1

గౌరీనిగూర్చి యీ వ్రతమూ — గావించితిరిగాదా? మీ
కోరికే నాతోనూ దెలుపారే! వో భామాలారా!
నానా ఫాలా మియ్యానే! 2

సారాసాక్షా! ఏూ మాదిలో — కోరికే నీతో జెప్పమూ
లేరా! నీవే తెలూసూకోరా! వో బాలాకృష్ణా!
— తెప్పనా తత్వార్థా మియ్యారా! 3

మానాసాములో కోర్కేలూ — పూనీ మీతో జెప్పగాటా[కూ
నేనూ సుద్దివా] డానూ[2] గానే! వో భామాలారా!
— నిజమూగా మీ రంటే వినేనే! 4

శ్రీతారిగొండా మా నారా — సింహునీతోడే! మా కోర్కె
నీతో జెప్పా సిగ్గయ్యానీరా! వో ముద్దూకృష్ణా!
— నీలో నీవే తెలూసూకోరా! 5

ద్విపద అని గోపికలు ఒల్కు — నా మా[ధవుండు
నను గౌరి] చింతించి — నారు, మేలయ్యె
సిగ్గుచే మీరది - జెప్పజాలకను

---

1. 'కంకాళిని' అనునది దుర్గయొక్క వివిధ స్వరూపములలో నొకదాని పేరు (మూ మోనియర్ విలియమ్స్ సంస్కృత — ఇంగ్లీషు డిక్షనరి, న్యూ ఎడిషన్ పుట 242)
2. 'సుద్ది (ఎరుక)చెప్పెడువాడు' అని యర్థము

తగ్గగా నేనె మీ — తలపు జెప్పితిని
సారసేక్షణలార ! — సంప్రీతితోను
వీారు రాత్రులయందు - మెరయుచు వచ్చి
అనువొంద తరిగొండ — హరి మెచ్చగాను

వ [అని పల్కిన, గో]పకాంతలు నమ్మక హరితో నిట్లనుచున్నారు

## దర్వు. అటతాళం

మగవాని మాట యి — మ్మహి మంచుమూాట
వగలు జూపే మేలు — వనధిపై వ్రాలూ 1
కామించె విభ్రమము — గగనకునుమము
భూమి పురుషుని విందు — పు [లి జున్ను మందూ 2
నీరజేక్షణు] మాటలు — నిజమనరాదు
తరిగొండహరి తోడె ! — దబ్బరా గాదూ 3

వ అని గోపికలు సందేహింపుచున్న, నవ్వి నందకుమారుం డిట్లనుచున్నాడు

ద్విపద నను నమ్మజాలక — నళినాక్షులార !
యనుమానము
రమణతో మిము నేను — రక్షించుపనికి
అమర మీా మధురాధ — రాబ్దులు సాక్షి
కొరవేమి ? మీ కుచ — కులగిరుల్ సాక్షి
కదియ మీా నాభి పు — ష్కరిణులు సాక్షి
ఎదుట రోమాళి ఫ — ణీంద్రులు సాక్షి
యదిగొ ! మా తరిగొం[డ — హరి నిత్యసాక్షి
నమ్ముడు నా] మాట — నవబోణులార !
మిమ్ము రక్షింతు, నే — మిటికి సందియము ?

వ అని గోపకాంతలకు నమ్మిక లిచ్చి, వారితో విలాసంబుగా నిట్లనుచున్నాడు

## దర్వు, అటతాళం

వేడూక గౌరమ్మ — జాడాగా నెడు శ్రీ
1

[తూగుటు] య్యాలవలె వుండె — వుయ్యాల తీగెల
నూగుదామా ? వో — చెలులారా ! 2

వాడిగా తరిగొండ — వానూని సరవులు
పాడుదామా ? వో — భామినులారా ! 3

## దర్వు*, ఆదితాళం

రారే వేడ్కను — రామలా [రా !] 1
॥రారే॥ 2
తుమ్మెద కొదమల — తోలుదాము రారే ! ॥రారే॥ 3
కుసుమ ఫలంబులు — గోతాము రారే ! ॥రారే॥ 4
శ్రీ తరిగొండ న్రృ — సింహుని మీరే ॥రారే॥ 5
ప్రార్థింపుచు న — త్వర మిమ్మనరే ! ॥రారే॥ 6

ఆ వె అనుచు వారితోడ వనవిహా [రము జేసి]

['మంద క] రుగు డింక, మన ధేనువుల మేప
పోయువత్తు నేను పొలతులార !'

వ అని పలికిన హరిని సాభిప్రాయంబుగా జూచి గోపికలు మంగళంబు బాడే విధం బెటువలెను

## మంగళము

### దర్వు, ఆదితాళం

నా ధవునకు జయ — మంగళం ॥పల్లవి॥
శ్రీమ ॥ ఉప ॥

---

* ఈ దర్వు యొక్క మొదటి పాదము పల్లవి వలె ఆవృత్తిపొందియుండుట గమనింప దగినది ఇది యిందలి కొన్ని గేయములకు సహజముగా కనబడుచున్నది

విదురవరదునకు — విశ్వంభరునకు
మదనజనకునకు — మంగళం
సదయహృదయునకు - చపలాసుర దు
ర్మదభంజనునకు — మంగళం ॥ మాధవునకు ॥ 1
సహజానంద ర — స స్వాంతునకును

చేతన — భరితోదరునకు
మహిమాఢ్యునకును — మంగళం ॥ మాధవునకు ॥ 2
గురుతర వేంకట — గిరిపతియై మము
మరువని సామికి — మంగళం
తరిగొండాధీ — శ్వరుడై మమ్మే
మరని నృహరికిని — [మంగళం ॥ మాధవునకు ॥] 3

## అనంతర కథా సంగ్రహము

ద్విపద [అని భక్తితో మం]గ — ళారతు లెత్తి
మనములు గరుగంగ — మందకు గోప
తరుణులు జని రంత — దనుజసంహరుడు
పరుగెత్తి చని గోప — బాలుర గూడి
పసుల మేపుచునుండి — బ్రాహ్మణస్త్రీల
పసమీర రక్షించి, — పర్వతమెత్తి
ఆమీ
కామినీమణులను — గలిసి, యానంద
కల్లోలముల దేల్చి, — కరిని, చాణూర
మల్లుని, కంసుని — మరి ఖక్కినట్టి
దుష్టరాజుల నెల్ల — దును మాడి, వరుస
శిష్టులనెల్ల ర — క్షింపుచునుండి
వనధిమధ్యంబున — ద్వారక గట్టి
పసుపు
బహుసంఖ్య నానర చే — పట్టి, పుత్రకుల

మహిమ మీరగ పెక్కు — మందిని గాంచి
పరమసంతోష సం — భరితుడై శౌరి
సురుచిర లీలల - సుఖియింపుచుండె

## సమర్పణము

అని యిట్లు శేషాచ — లాధీశు డగుచు
తను నేఁ తరిగొండ — ధాముని పేర†
•[వాసి కెక్కిన నంద — వరకులోద్భవుడు
శ్రీశిదాసుండు వా — సిష్ఠగోత్రుండు
కానాలవంశ సా — గర శశాంకుండు
నైన కృష్ణార్యున — కతివయై వెలయు
మంగాంబ సుతయయి — మహి బుట్టినట్టి
వెంగమాంబిక మోక్ష — విభవంబుకొరకు
నలువొప్ప తరిగొండ — నరసింహు కరుణ
లలి జలక్రీడా వి — లాసమున్ యక్ష
గానంబు జేసి వేం — కటగిరీంద్రునకు
పూని సమర్పించె — బుధసమ్మతముగ
భూచక్రమందు వెం — పుగ నీప్రబంధ
మా చంద్రతారార్క — మై యొప్పగాత !]



† మూలప్రతిలో గ్రంథ మింతవరకే యున్నది తరువాతి భాగము గల చిట్టచివరి తాళపత్రము లోపించినది అందు కవయిత్రి నామధేయము, అంకితప్రసక్తి గల ఐదారు ద్విపద పంక్తులు, ఆటుపిమ్మట — అనగా గ్రంథాంతమున — లేఖకుడు, లేఖనకాలము ఇత్యాది వివరము లుండియుండును

'[ ]'— ఈ గుర్తుల మధ్య గల ఆరు ద్విపదలు 'విష్ణుపారిజాతము' నుండి గ్రైకొనబడినవి అందు నాల్గవ ద్విపదలో నున్న 'నల పారిజాతాపహరణంబు యక్ష' అను పాదమునకు మారుగా నిందు 'లలి జలక్రీడావిలాసమున్ యక్ష' అని చేర్పబడినది

# అనుబంధము - (i)

**Note —** దిగువ నీయబడిన పాఠాంతరములు P ప్రతియందుండి స్వీకరింప బడినవి నీటిలో కొన్ని మూల ప్రతియందలి శిథిల భాగములకు పూరకములు

| పుట | పంక్తి | పాఠాంతరము |
|---|---|---|
| 3 | 9 | బాల — కృష్ణ లీలలను |
| 5 | 4 | జాహ్నవి పినతల్లి మాకు |
| 5 | 15 | అనిన విని వారు సంతసించిం రంత విఘ్నేశ్వరునకు |
| 8 | 11 | అరసి గోపకులు, |
| 10 | 19 | బ్రతుకు మీదా జోలీ విడువారా ! |
| 22 | 7 | విజిత శతకోటి మదనం, సత్య ధర్మ |
| 25 | 16 | గర్భమున దాల్చి |
| 35 | 7 | ప్రవిమలాకార ! |
| 36 | 4 | గచ్చాలవారి ! నీ—కనుగవ మోద్పావు ॥ చిచ్చో ॥ |
| 37 | 16వ పంక్తికి తరువాత | మాట యురవై యయిదేండ్లు జీవిస్తున్నాడూ |
| 38 | 8 | నలరుచు పురుడు పు—ణ్యాహవాచనము |
| 41 | 20, 21 పంక్తుల నడుమ | నావరింపుచు కన్ను — అప్పుడు దెరచి |
| 45 | 22 | యుచ్చెరు విక నేమిసేతు నమ్మయలారా ? |
| 47 | 2 | నడర నవ్వుల జూడ — నమితంబుగాను |
| 60 | 2 | బాలు డెరుగునటరె భామలార ? |
| 70 | 8 | గోపిదేవిసుతుని కొట్టు మంటివి, వాడు |
| 76 | 2 | తనయూల గన్నవారు గాదా ? |
| 83 | 14 | కామాక్షి ! జగదీశ్వరి ! జంబుకేశ్వరాఖిలాండేశ్వరి! |

| పుట | పంక్తి | పాఠాంతరము |
| --- | --- | --- |
| 143 | 24 | లలన! నా చీర తె — ల్లని చల్వ చీర |
| 152 | 14 | కొంటెలై కట్టిన — కోకలు విడిచి |
| 156 | 1 | చెలియలార! యొక్క చేత మ్రొక్కిన |
| 159 | 1 | నగధీర! యిది యేటి సద్దురా? |
| 164 | 3 | అండజవాహన! — పండితపాలన! |
| 164 | 10 | అనుచు మ్రొక్కిన సతులతో నంబుజాక్షు |
| 164 | 16 | పూచీనట్లుండు బంగారు — పూలా చీరెరా! |
| 165 | 4 | లాలితమైనట్టి కలిమి పూ — లా చీరెరా! |
| 165 | 8 | కోరి కొన్నట్టి కప్రప — ల్యాల చీరెరా! |
| 166 | 3 | ఘనముగ గోపిక లవి గ్రా, కొని |
| 166 | 9 | వ్రతమున్ పూర్తిగ నాచరించి, యట |
| 166 | 17 | సద్వరము సత్ప్రేమంబుతో నీయవే! |
| 167 | 6 | జలజా నయనా! గౌరీవ్రతమూ |
| 167 | 11 | గొబ్బ్యానా ఫాలామూ యిచ్చేనే! |
| 167 | 21 | అని గోపికలు బల్క — నా మాట రెల్ల |
| 167 | 21వ పంక్తికి తరువాత 22వ పంక్తికి ముందు | విని కృష్ణదేవుండు — వికవిక నవ్వి<br>మనము రంజిలజేసి — 'మదవతులార! |
| 167 | 22 | నను గొల్వ జింతించి — నారు, మేలయ్యె |
| 168 | 5 | నను బొందుదురు గాని — నమ్మి పొందిపుడు |
| 168 | 11 | భూమి పురుషుని విందు — పులి బెట్టె విందూ |
| 168 | 12 | నెరయ నీ మాటలు — నిజమనరాదూ |
| 168 | 16 | యనుమానమ్ముగ మాట — లాడనేల? |
| 168 | 22 | యదిగో! మా తరిగొండ — హరి సర్వసాక్షి |
| 168 | 23 | నమ్మరే! నా మాట |
| 169 | 2 | వేడూక గౌరమ్మ — జూడాగ నెదుటా |
| 169 | 3 | నా, ట్లాడుదామూ? వో — చెలియలారా! |

| పుట | పంక్తి | పాఠాంతరము |
|---|---|---|
| 169 | 4 | శయ్యాల వలె నుండె — వుయ్యాల తీగెల |
| 169 | 9 | రారే వేడ్కను — రమణులారా ! |
| 169 | 10 | పూ బొదరిండ్లకు — పోదాము రారే ! |
| 169 | 16 | చాల మోద మొసగి చక్రధరుడు |
| 169 | 24 | శ్రీమహి నీలునకు — మంగళం |
| 170 | 6 | మహిత చరితునకు — మంగళం |
| 170 | 7 | బహు విధ చేతన — భరితోదరునకు |
| 170 | 14 | అని కృష్ణునకు మంగ — ళారతు లెత్తి |
| 170 | 20 | ఆ మీదటను రాత్రు — లందును గోప |
| 170 | 27 | పని బూని రుక్మిణీ — ప్రముఖాంగనలను |

# అనుబంధము - (11)

శ్రీకృష్ణునకు 'జగన్నాటక సూత్రధారి' యని, 'లీలామానుషవిగ్రహు'డని పౌరాణిక ప్రసిద్ధి ఆయన లీలలతో ముడివడిన ఘట్టములలో మిగుల ముఖ్యమైనది గోపికల 'జలక్రీడ' ఈ ఘట్టమునకు గల ప్రశస్తిని గుర్తించిన పలువురు ప్రాచీనార్వాచీన కవులు ఈ కథావస్తువుతో వివిధ వాఙ్మయ ప్రక్రియలలో వేర్వేరు రచనలను వెలయించిరి

తెలుగున ఆ ఘట్టమును ప్రధానీకరించుకొని అదే పేరుతో గాని, లేదా ఆ ఘట్టముతో గూడిన భాగవత దశమస్కంధ కథను గైకొని మరేదైన పేరుతో గాని యక్షగానరచన గావించిన కవుల వివరము ఈ దిగువ నీయబడినది

| కవి | కృతి | వివరములు |
|---|---|---|
| *అక్కయ ప్రధానుడు (క్రీ శ 16,17 శతాబ్దుల నడిమి కాలము) | శ్రీకృష్ణలీలా విలాసము | శ్రీరంగపతికి అంకితము ముద్రితము 'యక్షగానములు' (4వ సంపుటము), ఆంధ్రవిశ్వ కళా పరిషత్తు, వాల్తేరు (1959) |
| శహాజీ (క్రీ శ 1684–1712) | జలక్రీడలు | శ్రీకృష్ణాంకితము ముద్రితము 'యక్షగానములు' (9వ సంపుటము), ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు, (1973) |
| సరభాద లింగోజీ (క్రీ శ 17వ శతాబ్ది) | జలక్రీడ | అలభ్యము |
| నిముషకవి రామయ్య (క్రీ శ 1758 ప్రాంతము) | జలక్రీడావిలాసము | విష్ణుసంవేద్యక్షేత్రమున వెలసిన రామేశ్వరున కంకితము (?) ముద్రితము శర్వాణీ ముద్రాక్షరశాల, అమలాపురము(1908) |

* ఈ కవి కాలమును తెలిసికొనుటకు ఇతరాధారములు లేకపోయినను, ఈతని రచనయందలి ప్రాచీనతను బట్టి కాల నిర్ణయము చేయబడినది.

| కవి | కృతి | వివరములు |
|---|---|---|
| — | జలక్రీడ | తిరువళ్ళూరు వీరరఘువునకు అంకితము అముద్రితము SVUOR Inst Library లో క్రింది సంఖ్యలు గల వ్రాత ప్రతులు గలవు D 1839 (b) (P L), D 1881 (P L), R 2421 (Paper), R 2422 (Paper) ఈ ప్రతులన్నియు అసమగ్రములు |
| — | భాగవతము | సత్యపుర వేణుగోపాలాంకితము అముద్రితము Adayar Library, Madras లో నొక వ్రాత ప్రతి కలదు సంఖ్య 74790 |
| ఆలూరి కుప్పన కవి (18వ శతాబ్ది మధ్య కాలము) | పార్థసారథి విజయము | చోళపురము పాలకుడగు వేంకటాచలవిభునకు అంకితము అముద్రితము SVUOR,I Library లోని వ్రాతప్రతులు D 1908(P L) R 7 58 (Paper), G O M, Library (Madras) లోని వ్రాతప్రతి R 1907(Paper), |
| భారతి రామరాజు (క్రీ.శ 1795 ప్రాంతము) | జలక్రీడలు | పొట్నదుర్తి శ్రీహరి కంకితము ముద్రితము సరస్వతీ నిలయ ముద్రాక్షరశాల, మదరాసు, తృతీయముద్రణ (1883) |
| రాయభట్టు వీరరాఘవ కవి (క్రీ శ 1800కు పూర్వుడు) | జలక్రీడా నాటకము | అలభ్యము |

| కవి | కృతి | వివరములు |
|---|---|---|
| పాకనాట గణపతిరెడ్డి (గణపతి పెద్దన అని నామాంతరము 18వ శతాబ్ది) | గోపాల విలాసము (కృష్ణ విలాసము) | నీలాద్రి నిలయుడగు జగన్నాథు నకు అంకితము (?) ఐదారు తడవలు ముద్రితము అందొకటి రాయపురం రత్నా నాయకర్ శ్రీ సరస్వతీ ముద్రాక్షర శాల, మదరాసు (1886) |
| శీర్నాగు వెంకటరాయ కవి | లేపాక్షి కృష్ణ నాటకము (జలక్రీడలు) | లేపాక్షి శ్రీహరికి అంకితము మూడు తడవలు ముద్రితము విశాఖపట్టణము (1931), వెస్టు వార్డు అండ్ కో, మద రాసు (1947, 1950) |
| కానుకొలను వెంకటదాసు (19వ శతాబ్ది పూర్వా ర్ధము) | శ్రీకృష్ణ నాటక యక్షగానమను ప్రబంధరాసక్రీడా విలాసము | ఇందు గోపికల 'జలక్రీడల' ఇతి వృత్తము గల ఆశ్వాసము నే డలభ్యము 'రాసక్రీడల' కథా భాగము గల చతుర్థాశ్వాసము మాత్రమే లభ్యమై, రెండు తడవలు ముద్రితమైనది నేష నల్ ప్రెస్, బందరు (1926), వెంకట్రామ పవర్ ప్రెస్, ఏలూరు (1948) |
| మతుకుమల్లి నృసింహ కవి (క్రీ శ 1816–1873) | శ్రీకృష్ణ జలక్రీడా విలాస నాటకము | అలభ్యము |
| మరింగంటి వేంకట నృసింహా చార్యులు (క్రీ శ 1842 ప్రాంతము) | ఇందిరా భాగవతము | అముద్రితము వ్రాతప్రతి హైదరాబాదు లక్ష్మణరాయ పరి శోధక మండలిలో కలదట |

| కవి | కృతి | వివరములు |
|---|---|---|
| చిలకమర్రి నారాయణాచార్యులు (క్రీ శ 1865 ప్రాంతము) | భాగవతము (దశమస్కంధ పూర్వ భాగము) | అలభ్యము |
| భారతుల శ్రీ రంగకవి (క్రీ.శ 1879 ప్రాంతము) | శ్రీకృష్ణలీలలు (శ్రీకృష్ణ జలక్రీడలు) | మాచెర్ల చెన్న కేశవునకు అంకితము ముద్రితము వర్తమాన తరంగిణి ముద్రాక్షరశాల, మదరాసు, (1881) |
| మైసంపాటి వీరరాఘవయ్య (19వ శతాబ్ది ఉత్తరార్ధము) | బాలగోపాల విలాసము | నాలకూరపాటి వేణుగోపాలస్వామి కంకితము ముద్రితము శ్రీ వాణీ వినోద మందిర ముద్రాక్షరశాల, మదరాసు (1887) |
| ద్విభాష్యం పుల్లకవి (19వ శతాబ్ది ఉత్తరార్ధము) | శ్రీ కృష్ణ గోపీ జలక్రీడా భాగవతము | అలభ్యము |
| గరికిపాటి సూర్యనారాయణ శాస్త్రి, (19వ శతాబ్ది ఉత్తరార్ధము) | శ్రీకృష్ణ జలక్రీడా నాటకము | ముద్రితము(1898),అలభ్యము |
| వి వెంకట నారాయణకవి (20వ శతాబ్ది పూర్వార్ధము) | శ్రీకృష్ణ బాల క్రీడా విలాసము | ముద్రితము (1901), అలభ్యము |
| వేదంభట్ల వేంకటరాయ కవి (20వ శతాబ్ది పూర్వార్ధము) | జలక్రీడా విలాసము | పూసపాటి వేంకటపతి రాజునకు అంకితము ముద్రితము శ్రీ శారదా మకుట ముద్రాక్షరశాల, విశాఖపట్టణము (1906) |
| లంబటిపూడి అనందయ్య (20వ శతాబ్ది పూర్వార్ధము) | గోపికా వస్త్రాపహరణము | ముద్రితము (1908), అలభ్యము |

| [illegible] | కృతి | [illegible] |
| --- | --- | --- |
| నాగినేని వెంకటప్ప (20వ శతాబ్ది పూర్వార్ధము) | కృష్ణలీలా నాటకము | ముద్రితము (1914), అలభ్యము |
| బళ్ల రామరాజు (20వ శతాబ్ది పూర్వార్ధము) | శ్రీకృష్ణలీలలు | ముద్రితము, తొమ్మిదవ కూర్పు శ్రీకాళహస్తి తమ్మారావు అండ్ సన్స్, రాజమండ్రి (1945) |
| చెర్విరాల భాగయ్య (20వ శతాబ్ది ఉత్తరార్ధము) | భాగవతము | తెలంగాణా ప్రాంతమందలి 'చందా' గ్రామమున వెలసియున్న దేవున కంకితము ముద్రితము కొండా శంకరయ్య అండ్ కో, సికింద్రాబాదు (1954) |

Note – పై పట్టికయందు అలభ్య కృతులుగా పేర్కొన్న వాటిలో నొకటి రెండు యక్షగానేతర నాటకము లుండిన నుండవచ్చును

పై పట్టికను బట్టి క్రీ శ 17వ శతాబ్దికిపూర్వమునుండియే తెనుగున 'జలక్రీడా' వస్తుక యక్షగానరచన సాగినట్లు నిశ్చయింప వీలగుచున్నది

పై పట్టిక యందలి 4, 8, 10, 11, 16, 21 సంఖ్యల కవుల రచనలు వెంగమాంబ జలక్రీడా విలాసమువలెనే శ్రీకృష్ణ జన్మ వృత్తాంతముతో మొదలిడి గోపికల జలక్రీడల ఘట్టముతో ముగియుచున్నవి అందులోను 4, 8, 11 కవుల రచనలకు వెంగమాంబ రచనకు కథా విస్తృతిలో సన్నిహిత సారూప్యము గోచరించుచుండుట యొక విశేషము

పై పట్టికను సమకూర్చుటలో ఉపకరించిన గ్రంథములు

1 ఆంధ్రవాఙ్మయ సూచిక (1929) ప్రకా కీ శే కాశీనాథుని నాగేశ్వరరావు
2 ఆంధ్రకవి సప్తశతి (1956) బులుసు వేంకటరమణయ్య
3 ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర (1961) డా యస్వీ జోగారావు ఎమ్ ఏ, పి హెచ్ డి
4 మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయమువారి డిస్క్రిప్టివ్ కేటలాగులు